# శరత్కాలము

కం॥ జొంపములు గొనియెఁ బవనములు;
రొంపులిగిరె; నెమలిగముల రొదలుడిగె; నదుల్
పెంపులకుఁ బాసె; మరుముల
శంపల సంపదలుమానె శారదవేళన్॥

కం॥ వాజుల నీరాజనములు,
రాజుల జయగమనములును, రాజితలక్ష్మీ
పూజలు, దేవోత్సవములు
రాజిల్లెను జగతిలో శరత్సమయమునన్॥

కం॥ చేగగల చెఱకువింటను
బాగుగ నీలోత్పలంబు బాణంబుగ సం
యోగంబుసేసి మదనుఁడు
వేగంబున విరహిజనుల వేఁటాడు నొగిన్॥

—భాగవతము



# దసరా

శ్లో॥ మాణిక్యవీణా ముపలాలయన్తీమ్। మదాలసామంజుళవాగ్విలాసామ్।
మహేన్ద్రనీలద్యుతి కోమలాంగీమ్। మాతంగకన్యామ్ మనసాస్మరామి॥
చతుర్భుజేచన్ద్రకళావతంసే। కుచోన్నతే కుంకుమరాగశోణే।
పుండ్రేక్షుపాశాంకుశ పుష్పబాణ। హస్తే నమస్తే జగదేకమాతః॥

మాతామరకతశ్యామా। మాతంగీమధుశాలినీ।
కుర్వంకటాక్షంకళ్యాణీ। కదంబవనవాసినీ।
జయమాతంగతనయే। జయనీలోత్పలద్యుతే।
జయసంగీతరసికే। జయలీలాశుకప్రియే॥

—“కాళిదాసుఁడు.”

కర్మభూమి యనఁబడు భరతవర్షమున సమస్త జాతులవారును, భక్తిశ్రద్ధలతోఁ దమశక్తికొలఁది ననుష్ఠించు పూజలలోనెల్ల మిగుల ముఖ్యమైనది యీ దసరా పూజ. ఈ విషయమున వ్రాయఁబడియున్న పురాణము లెన్నియో కలవు. మాయాతీతస్వరూపిణియైన మహాశక్తి మహిషాద్యసురసంతానముల మర్దించుటకై కాళీత్యాద్యవతారములనెత్తి, లోకజాలములు మహాసంకటసాగరముల నుత్తరింపఁజేసినదికదా. త్రినేత్రుఁడా ప్రేమ మయికేఁ దనమేన నొకసగము నొసఁగినాఁడు. మరి బ్రహ్మాదులగు నితరదేవతలందరు, నా లోకమాతకు దాసవర్గములైనారు. పురాణాంతర్గతములై యున్న ఆయాగాథలను జదువునపుడు, మానవమాత్రుఁడైనవానికిమేను గగుర్పొడుచును. అప్రయత్నముగ నానందబాష్పములు రాలును. ఆశక్తినే బ్రాహ్మణుడు విద్యారూపమునను, క్షత్రియుఁడు బలరూపమునను, వైశ్యుఁడు లక్ష్మీరూపమునను, శూద్రుఁడు మాయారూపమునను సేవించుచు

న్నారు. ఇఁకను లోకమునందున్న సమస్తవృత్తులయందును యథాయోగ్యముగ నారాధింపఁబడుచున్నట్టిది ఆశక్తియే!! ఈయారాధనయందుఁ బ్రతివాఁడును, సర్వదా జగత్కళ్యాణ కాంక్షగలిగి జంతుసహజమగు నహంకారమను పశువును బలియిచ్చి తన్మూలమున శక్తిప్రసాదమునొంది మహాత్ముఁడై వెలయఁగలుగును. మెండియు నీయారాధనకుఁగాను నిర్దేశింపఁబడిన సమయమును మూరునిబారిదేరి, సూరుని పరితాపమును మీరి, దుర్దినములుతీరి గలకలలాడు వెన్నెలలతో, నిర్మలసలిలపూరంబులతో, మంద మంద మలయానిల సంచారంబులతోఁ బరమ శోభాయమానమై, వెలయుచుండునట్టి శరదారంభము. కాఁబట్టి యీమహాశక్తి యిప్పట్టున శారదా నామకయై సర్వత్రపురుషునికి పూజాపాత్రయై వెలయుచున్నది. గృహమేధి నియమియై నవరాత్రములు నీ శారద నుపాసించి యావలఁ దత్ప్రసాదమున సర్వార్థవిజయుఁడై ధన్యుఁడగుచున్నాఁడు.

కొందఱి కిది రుచింపకపోవచ్చును. కాని యథార్థమింతే. పురాణేతిహాసము లీయర్థమునే సహస్రముఖముల నుద్బోధించుచున్నవి. ఇది యెఱింగిన వాఁడెంతయే నిహసుఖములనే గాక పరసుఖములను గూడ నొందఁగలఁడు.

శ్లో॥ శివశ్శక్త్యాయుక్తో యది భవతి శక్తః ప్రభవితుం।
న చే దేవం దేవో నఖలు కుశలః స్పందితుమపి।
అతస్త్వామారాధ్యాం హరిహరవిరిఞ్చ్యాదిభిరపి।
ప్రణంతుం స్తోతుం వా కథమకృతపుణ్యః ప్రభవతి॥

అని శ్రీశంకర జగద్గురుపాదులు సెలవిచ్చినట్లు, ఆయీశ్వరుఁడైనను శక్తిసంయోగముచేతనే జగముల నిర్మించుచున్నాఁడు గాని, యటు గానియెడలఁ గదలనైనఁ గదలలేఁడు. మఱియు హరిహర విరిఞ్చ్యాదులచేఁ గూడ సేవింపఁబడుచున్న దీశక్తిస్వరూపమే! అట్టిదాని నర్చించుట పుణ్యాత్ములకు సులభము, అకృతపుణ్యుల కసాధ్యము. అహంకారమను దానిని బలివెట్టుటచేతఁ బుణ్యము దనంతఁ దాఁగలుగును. అహంకార విమూఢునకు లోకమంతయుఁ బల్లేరుకాయల పరపు వలెఁ దోఁచును. కావున బుద్ధిమంతులలో బుద్ధిమంతులనఁబడియున్న యార్యులు స్త్రీశక్తుల నేనాఁడుఁగాని యరికట్టి యుంచలేదు—అహంకారపరవశులై యుండలేదు. స్వశక్తియుక్తులై సత్కుమారజనకులై బుధవంద్యులై గృహస్థాశ్రమమే మోక్షదాయకమని సర్వత్ర ఒప్పించిరి. వారు పట్టిన యటువంటి "చక్కని రాజమార్గముండఁ సందులు దూరనేల" యని విశ్వాసయుతులై యువతీయువకులు శ్రీవంకరులగు గౌరీశంకరుల నీనవరాత్రులయం దారాధించి ధన్యచరితు లగుదురుగాక యనియే గృహలక్ష్మి సర్వదా కోరుచుండును. మఱియుఁ దన యోగక్షేమాభివృద్ధికై యనేకభంగుల సహాయపడుచున్న కవులకుఁ గవయిత్రులకుఁ జిత్రకారాది సుమనస్కులకుఁ దనకృతజ్ఞతా పూర్వకాభివాదములఁ దెలుపునే తద్గృహలక్ష్మిని సర్వదా మన్నించి, మనసుంచి, దీవించి మాన్యమగు నాంధ్రలోకము ధన్యతగాంచుఁగాత!

"లోకాస్సమస్తాస్సుఖినోభవన్తు"

# తొలి కానుక

వఝ్జల వేంకటేశ్వర కవిగారు బి. ఏ.

(........ .....క.)

శ్రీకరమ్ములగు పసుపుకుంకుములు
పెట్టనిసొమ్ములు నీకు మానినీ!

ఆకులచాటునఁబుట్టిన పసిమొగ్గ పూవుగా వికసించినది. తుమ్మెదయొకటి ఆపూవులోని తీయతేనెలు త్రాగినది.

కోమలీ! పుష్పమువలె నీశరీరము సుకుమారము. తేనియవలె నీ హృదయము మధురము.

కోమలములైన లతలకుఁబువ్వులే నగలు. సుకుమారమైన నీబంగరుమేనికిఁ బసుపు కుంకుములే భూషణములు.

ప్రేమస్వరూపిణివగునీవు నీభర్తహృదయరాజ్యసింహాసనమున వర్ధిల్లు రాణివి.

నీస్నేహితుఁడు! నీప్రాణము! నీవేల్పు!—నీభర్త.

నీభర్తకు నీవో? ప్రియురాలవు! ప్రాణమవు! దివ్యజ్యోతివి!

మేఘములో మెఱసినది మెఱుపు! పూలలోఁ బుట్టినది పరిమళము! మకరందములో ఇమిడినది మాధుర్యము, మాటలోమాట, మనసులోమనసు, భార్యాభర్తల పరస్పరప్రణయము!

నీభర్తకు నీవు: కార్యావసరములందు ఆలోచనచెప్పు మంత్రివి; గృహకృత్యములు చేయుటయందు దాసివి.

నీకునీభర్త: ప్రేమవృష్టిలో నిన్ను ముంచెత్తుటకు మేఘుఁడు! నీసౌఖ్యముకై తన సర్వశక్తులు ధారవోయు కష్టజీవి!

నీభర్త! నీసంసారము! నీయాస్తవర్గము! నీదేశము! నీప్రపంచము!—మఱచిపోకుము.

పువ్వు వనలక్ష్మి! వెన్నెల గగనలక్ష్మి! నీవో, గృహలక్ష్మివి.

విజయదశమి—సరస్వతీపూజాదినము. బాలబాలికలు,—సరస్వతీ! నమస్తుభ్యం, వరదే! కామరూపిణి! విద్యారంభం కరిష్యామి సిద్ధిర్భవతు మే సదా—అని పఠింతురు. విద్యాభ్యాసము మఱవకుము.

పఠించితివా?—పురాణపతివ్రతాకథలను, భారతనారీ జీవితములను. చూచుచున్నావా?—దేశారాధనా పరురాండ్రను, విద్యావివేకురాండ్రను.

చనిపోయిన భర్తను బ్రదికించినది-ఒకభార్య. రాజ్యము గోల్పోయిన భర్తతో అడవులపాలయినది—ఒకభార్య. పాతివ్రత్యప్రభావము తెల్పుటకు అగ్నిలో దుమికినది—ఒకభార్య.

భర్తపోయినవెంటనే చితిపేర్చుకొని సహగమనమొనర్చినది—పద్మిని. పురుషునివలె రాజ్యమునేలి శత్రువులతో యుద్ధముచేసినది ఝాన్సీలక్ష్మి.

దేశముకొఱకు, దేశములోని ప్రజలకొఱకు, స్వార్థత్యాగముచేసి, కష్టముల కోర్చి, పాటుపడుచున్నారు ఖద్దరువస్త్రధారిణులగు సోదరీమణులు, ఎందఱో! వారిని నమస్కరింపుము.

కాంతలేనిగృహము చింతాక్రాంతము. దినమెల్లఁగష్టపడి తిరిగివచ్చిన తన కాంతునకు సంతసముఁ గాంత యిడుఁగాదా?

భార్య, భర్తవలన ఆశించునది ధనముకాదు, మనఃపూర్వకమయిన ప్రేమ. ధనము అనురాగమును సంపాదింపలేదు. భార్య, భర్తకు ఇచ్చునదేమి? ప్రేమాన్వితమయిన తన హృదయసర్వస్వము. అమాయికమయిన నీమాటలలో నీమనసు మెత్తఁదనమే హత్తుకొననిమ్ము; అతని కంటిజాడలలో నీ నీడ కనుగొనఁగలవు.

చివురాకులవంటి నీపెదవుల మెత్తఁదనము, మకరందమువంటి నీమాటల మాధుర్యము, తెలివెన్నెలవంటి నీచూపుల నైర్మల్యము, నీమనసులో చూపించుము.

పార్వతీదేవి పరమతపస్సు చేసినది. పరమశివుఁడు మారురూపుతో ప్రత్యక్షమైనాఁడు; ఆమె భక్తికి, కార్యదీక్షకు మెచ్చినాఁడు; తనశరీరములో అర్థము నామెకిచ్చినాఁడు.

పెండ్లిసమయమున వధూవరులకు "అదిగో! అరుంధతి!" అని నక్షత్రముల వైపు చూపింతురు. ఆమె వసిష్ఠుని భార్య, పరమపతివ్రత.

చేతులకు గాజులు, మెడలోవాచీగొలుసు, నడుమునకు ఒడ్డాణము, ఇవి తెచ్చిపెట్టుకొన్ననగలు. సిగ్గు—ఇది భగవంతుఁడిచ్చిన సహజభూష. సౌందర్యమునకు వన్నెపెట్టు దీనివిలువ ఇంతయని చెప్పలేము.

రాజ్యములేలిన స్త్రీలు, కావ్యము లల్లినస్త్రీలు, యుద్ధములు చేసిన స్త్రీలు, బుద్ధి బలముచూపిన స్త్రీలు ఎందఱో? స్త్రీ సహచరీత్వమునఁగాని మానవుఁడు ఒక్కొకపుడు కార్యము సాధింపలేఁడు.

గర్వించినవారికి అధఃపతనము. అట్టివారిపై లోకమునకు దయలేదు. వినయము, శాంతము, గుణములలో మంచివి.

“స్త్రీలు కలికలు”అని యొక మహాకవి. “స్త్రీహృదయము క్రూరము”అని యింకొకకవి. ఈవచనముల యర్థము మాపుమాపుట స్త్రీలక ర్తవ్యము.

ప్రపంచమునకంతకు మహోపకారముచేసి చిరకీర్తినార్జించిన స్త్రీరత్నములు, దేశమునుగాపాడి పేరునిలుపుకొన్న స్త్రీరత్నములు, కుటుంబమునే బాగుచేసి గృహముల కుపకరించిన స్త్రీరత్నములు, ధన్యజన్మలు!

భోగములు శాశ్వతములుగావు. స్థిరమైనది పేరు. నలుగురిలో ‘మంచిది’ ‘మంచివాఁడు,’ అనిపించుకొనుటచేతనే జన్మము సార్థకమగును. ఒకరిమనసు నొప్పించక ఉండుటే దీనికి మార్గము.

యువతీ! విద్యనేర్చి జ్ఞానము సంపాదింపుము. నీభర్త విద్యావంతుఁడు, నీవు విద్యాశూన్యురాలవు అగుట ఉచితము కాదు. విద్యాజ్ఞానములేనిచో నీవు, విద్యావంతుఁడగు నీభర్త యాలోచనములయందు విశ్వాసముంచుము.

యువతీ! నీభర్త మూర్ఖుఁడైనచో, మంచియాలోచనచెప్పి అతనిని మంచి మార్గములోనికి త్రిప్పుబాధ్యత నీది సుమా!

పాతివ్రత్యమునకు, శీలమునకు, సద్గుణములకు, ఉదాహరణము హిందూరమణి. హిందూరమణివైననీవు ఆపేరు నిలఁబెట్టుము.

కష్టమునకు, ఆయాసమునకు, ఓర్చి ధనము ఆర్జించువాఁడు పురుషుఁడు. ధన మూల్యము ఆర్జించినవానికి బాగుగాఁ దెలియును. గృహకృత్యములు నడుపునది భార్య; కావున జ్ఞానవతివై ధనవ్యయ మూహింపవలెను.

సుఖముగాని, కష్టముగాని మనస్సులోనుండును. “ఇంకనాకేమికొఱఁత?”అనుకొన్నచో ఎప్పుడును సుఖమే. “అయ్యో! నాకిదిలేదు” అనుకొన్నచో ఎప్పుడును కష్టమే, విచారమే.

కులములో గొప్పతనములేదు. వాల్మీకి జన్మచే మాలవాఁడు. పురంలక్ష్మిదేవి కోమటిది, సహగమనము చేసినది. శ్రీకృష్ణుఁడుగొల్లవాఁడు. వీరినందఱను మనము పూజింపలేదా? బ్రాహ్మణజన్మమాత్రమున ఫలములేదు. గుణమే ముఖ్యము.

సంసారవిషయమున మానవజాతి, జంతువులనుండి, పక్షులనుండి, కీటకముల నుండికూడ నేర్చుకోవలసిన విషయము లెన్నియో కలవు.

కాలచక్రము నిల్చిపోక తిరుగుచున్నది; సంసారియగు మానవుని జీవితము, నట్లే. సుఖదాయకమగు వసంతము, కష్టకరమగు శీతకాలము, ఒకదానివెంట నొకటి వచ్చుచునే యున్నది; సంసారములో సుఖము, కష్టము, నట్లే.

నేడు వికసించినపూవు రేపు వాడిపోవును. రేయి ముకుళించిన పద్మము సూర్యోదయమున వికసించును. ఇంతలో ఎండ; అంతలో వాన. పండువెన్నెల; ఇంతలో మేఘముడ్డుపడినది నల్లఁగా. కష్టసుఖములు శాశ్వతములుగావు; కావడికుండల వంటివి. సంసారమున భార్యాభర్తలు రెంటిని మోయవలసినదే.

ప్రతిఫలము నాసించి యిచ్చినచో, నది యీవి గాదు. మనఃపూర్వకముగా ప్రతిఫలకాంక్షారహితముగా, అవిచారముగా, ఇచ్చినచో అదియే నిజమైన కానుక.

కానుకయొక్క విలువ దానిధనమూల్యములో లేదు. కానుకయిచ్చినవ్యక్తి యొక్క హృదయము లోనున్నది. హృదయముతో ఇచ్చినకానుక అమూల్యము దానికి ప్రతిఫలము హృదయమే.

---

## రామ మోహన రాయ్

కీ. శే. జనమంచి వేంకటరామయ్యగారు

మ॥ జనసంఘంబులయందునిల్చిన దురాచారంబులంబాపి స
న్మునిసంసూచితధర్మమార్గముల సొంపుల్ సూపి దేశాభివృ
ద్ధినిమిత్తంబనిశంబు పాటుపడి సత్కీర్తుల్ దిశల్ నిండఁగా
ఘనుడై మించిన రామమోహనుకథల్ గావింపవే మోదముల్.

శా॥ సత్యంబేకడనున్న గ్రాహ్యమనువిశ్వాసంబుతో లోకసం
స్తుత్యప్రక్రియ భిన్నదేశమతముల్ శోధించి బోధించెగా
సత్యంబొక్కటెయంచు, గానఁబడువై షమ్యంబు లజ్ఞానపుం
గృత్యంబంచును రామమోహనుఁడు సంక్షేపించి వేదార్థమున్.

# శ్రీ దుర్గపూజా పర్వదినములు

ఆకుండి వేంకటశాస్త్రిగారు

దేవుఁడు సృష్టిస్థితిలయముల నొనర్చు టనుబట్టి త్రిమూర్త్యాత్మకుఁడు. బ్రహ్మవిష్ణు మహేశ్వరాత్మకుఁడు. సృష్టి జేయునప్పుడు బ్రహ్మయనియు, పోషణపాలన కార్యములఁ జేయునప్పుడు విష్ణువనియును, లయమొనరించునపట్ల మహేశ్వరుఁడనియుఁ దెలియఁదగును. ఈ కర్మకలాపమును నెఱపుటకే దేవుఁడు భూలోకమున నవతరించెను. త్రిమూర్త్యాత్మకుఁడైన దైవము నారాధించుటలో మన హిందువులలో బహుమతము లుద్భవిల్లి ప్రవర్తిల్లినవి. మతములు, ఆరాధనారూపములు భిన్నములుగఁ గన్పట్టినను దైవమొక్కఁడే. జనులు కాలక్రమమున సీమూల తత్త్వమున కనుగుణముగనే దేవుని భిన్నరూపములచే నారాధించుటచే యేర్పడిన మతములను పేరిట విశ్వాసములఁ దగులొ్కనియున్నారు. ఈమతములలో ప్రధానమైనవి వైష్ణవము, శైవము. ఈమతావలంబకు లొక్కొక్కప్పుడు సాత్త్విక, రాజసిక, తామసిక భక్తిభావములతో తమ యిష్టదైవముల నారాధింతురు. సాత్త్వికభక్తి యుత్కృష్టమైనది.

ఈ దుర్గపూజ శైవులకు ముఖ్యమైనది. మూలతత్త్వము నెఱింగినవారును సమరస భావమున మెలంగు వైష్ణవులు నీదుర్గపూజ యెడ విముఖులు గానేరరు. దుర్గపూజ యాసేతు హిమాచలము, మనదేశమునం దాదరముతో నాచరింపఁబడుచునే యున్నది. బంగాళా దేశమున నీదుర్గపూజ ప్రత్యేక ప్రాధాన్యము వహించినది. బంగాళా దేశమునకు ప్రధాననగరము కలకత్తా. పూర్వ మీ నగరము కాళీఘట్టమను పేరఁ బిలువఁబడుచుండెను. ఆనగరమున ప్రసిద్ధమైన కాళికాలయ మొకటిగలదు. పూర్వ మా దేవికి నరబలులు కూడ నీయఁబడుచుండెనని ప్రతీతిగలదు. సర్కారువారిచే నిప్పు డట్టిబలు లాపివేయఁ బడినవి. బంగాళా దేశీయులకు కాళిక యిలువేలుపు. వా రాదేవిని 'కాళీమాత' యని పిలిచెదరు. ఆ దేవికి సింహము వాహనము. ఆమె శక్తిస్వరూపిణి. ఆమెకు దుర్గ, చండిక, మహిషాసురమర్దని యను నామాంతరములు గలవు. ఈమెకుగల యితరనామములు ఉమా, కాత్యాయనీ, గౌరీ, కాళీ, హైమవతీ, ఈశ్వరీ, శివా, భవానీ, రుద్రాణీ, శర్వాణీ, సర్వమంగళా, అపర్ణా, పార్వతీ, దుర్గా, మృడానీ, చండికాంబికా, ఆర్యా, దాక్షాయణీ, (చైవ) గిరిజా, మేనకాత్మజా.

కాళిదాసు తన కుమారసంభవకావ్యమున నొకసందర్భమున పార్వతికి 'అపర్ణా' అను పదమును ప్రయోగించెను. పార్వతి శివుని పెండ్లాడుటకై ఘోర తపమొనర్చెను. ఆ తపస్సుచేయుటలో నిరాహారయై, ఆకలములనైన భక్షింపక తపమొనరించెను. అందుచే నన్వర్థనామ మామెకు గల్గెను.

పార్వతికి కుమారస్వామి యను కుమారుడు గలడు. అతడు 'యుద్ధదేవత'గా తండ్రిచే నియోగింపఁబడెను. శివునికి వీరభద్రుఁడను మరియొక కొమారుఁడుగలడు.

ఈ దసరాదినములలో సాముగరిడీలు— నేర్చువారెల్లరు తమ వ్యాయామమునకై యుపయోగము చేయు నాయుధములను పూజ చేయుదురు. వీరభద్రుని విగ్రహమును యూరేగించుచు సాముగరిడీలను నేర్చువారందఱు తమకుగల యాయుధముల నుపయోగించు నేర్పును ప్రజలకుఁ గనపరతురు. అట్టి యాయుధముల పూజకే ఆయుధపూజా పర్వదిన మేర్పరుపఁబడినది.

ఈ దుర్గపూజాదినములలోనే 'సరస్వతీ పూజ'ను ప్రాధాన్యముగ కొందఱు చేయుదురు. సంగీతకళోపాసకు లీదినములలో గానకళావినోదముల కాలముగడపుదురు. బ్రహ్మ విష్ణు మహేశ్వరుల సతులగు సరస్వతి, లక్ష్మి దుర్గలకు కొందఱు పూజలుచేయుదురు. ఈ పూజలు ముఖ్యముగ 'నవరాత్రుల'లో జరుగును. పూజలు 'దసరా' నాటితో ముగియును.

'విజయదశమి' అను కడపటి పర్వదినమునకు భారతసంబంధమైన గాథను కొందఱు చెప్పుదురు. పాండవు లజ్ఞాతవాసకాలమున తమ పాశుపతాది దివ్యాస్త్రములను తదితర శస్త్రముల నితరులకు తెలియకుండునట్లొక శవములో నిమిడ్చి దానినొక శమీవృక్షముపై దాచిరనియు, వారి యజ్ఞాతవాసదీక్ష ముగియునంత వా రాయస్త్రముల నాశమీవృక్షమునుండి దిగిచి, వానిని గైకొని తమ శత్రువులతో పోరగా, జయముబడసిరనియు, వారి విజయమునకు జ్ఞాపకార్థముగ నీ'విజయదశమి' యను పర్వదినమేర్పరుపఁబడెననియు కొందరు విజ్ఞులు చెప్పుదురు. అట్టి దివ్యాస్త్రములను ధరించిన 'శమీ' వృక్షమిట్లుఁ గొండాడఁబడుచున్నది.

శ్లో॥ శమీ శమయతేపాపం, శమీ శత్రువినాశనీ
అర్జునస్యధనుర్ధారీ, రామస్యప్రియదర్శనీ.

ఆ స్త్రీకులగు వారెల్లరకీ 'పూజాదినములలో' అంబికాపూజచేయుట శుభంకరము. దక్షిణహిందూదేశభాగముల దాక్షిణాత్యలీనవరాత్ర్యుత్సవముల నింటో మనోజ్ఞాలంకరణములతో 'బొమ్మలకొలువు'లను నెలకొల్పి సంగీతాదికముల వినోదింతురు.

---

## ప్రణయసౌఖ్యము

అధికార్ల సూర్యనారాయణరావుగారు బి. యే. బి. యల్.,

జలజలమని భంగంబులు జలధిబొంగుచు
గలచె మానసంబు మృదులగానముతోడ!
చందురుండు మబ్బులేని చదలవెలుగుచు
విందొనర్చె కన్నుగవకు వెన్నెలతోడ!
జానకీ సుమాంగి నాదుసరస నవ్వుచు
ప్రాణములకు హాయిగూర్చె ప్రణయముతోడ!

పిలకా గణపతిగారు

ఏరుల కోలనుల కొండల కోనల
వనముల పొలముల సంద్రములన్
వెన్నెల తళతళ మెరయుచు ముంచెన్
నిశ్శబ్దముగా పారుచును.

ఆకాశమ్మున వెండిపంజరము
నల్లిన చల్లని జాబిల్లి
రెల్లుపూల తెలిరేకుల చిమ్ముచు
లోకమ్మంతా విరజిమ్మెన్.

తెలిజలదమ్ముల మెల్లన ద్రోయుచు
వెండినావవలె పరువిడుచున్
చంద్రుడు భయమున కన్నులుమూయగ
వెన్నెల వెంటనె దాగికొనెన్.

తళతళ మెరసే యిసుకపొరలలో
గలగలపారే ఏరులలో
ఊతాలాడే తరంగముల పై
కుందమాలికలు విరజిమ్మెన్.

స్వర్గతుల్యమగు జీవలోకమున
నిత్యముగా నివసించుటకో
కిరణములల్లిన దాగెనువనముల
నల్లని తరువుల నీడలలోన్.

ఆకాశమ్మున నాలస్యమ్ముగ
గూడుల జేరెను పికరాజుల్

మలపులు తిరుగుచు వెన్నె కాంతిని
తళుక్కుమని మెరసెన్.
మల్లెలు తెల్లని చంద్రకాంతములు
తారలవలెనే వికసించెన్.

నీటనిమునిగిన ముత్తెములవలె
చుక్కలు వెన్నెల తేజరిలెన్.
నాల్కలు కదుపుచు నెమరులువేసెడి
నల్లని చూపుల గోవులును

కన్నులుమూయుచు తెరచూడు కర్ణము
లల్లన మెల్లన నాడించెన్
మిలమిలలాడే తెలికన్నులతో
గలగలరాలెడు నవ్వులతో

నెమలిపింఛముల బోలుకన్నియలు
వచ్చిరి వెన్నెల నాటకుకై
బాలికలందరు కిలకిలనవ్వుచు
భూమణిరవములు చెలరేగన్.

వెన్నెల వలువలు తళతళ మెరయగ
గిరగిర తిరిగిరి వేగముగన్.
నవ్వులు వెన్నెల మెల్లగ కలిసెను
నిశ్శబ్దమ్ముగ నీడలు తిరిగెను

ఇసుకల నాడెడి బాలకులందరు
కాంచిరి కెవ్వలు వాల్సరకన్.

# దసరా పండుగ

శ్రీమతి చిల్కపాటి సీతాంబగారు

ఉ. మేడలు మందిరంబులును మేలిమివీధులు సందుగొందులున్
జాడగ నబ్బురంబగుచు సొంపులుగుల్క వినృత్తగీతముల్
వేడుకగొల్ప నెల్లపృథివీజనముల్ముదమంద వేడ్క వె
న్నాడె శుభాస్పదంబయి మహోముదమై దసరాభృశంబుగన్.

సీ. మల్లెమొల్లలును చేమంతిపూవులనుంచి చాలనేర్పున విరిజడలువైచి
బలువేడ్కజిల్గువల్వల నవ్యదేశీయచావలయట్టిముస్తాబుజేసి
మేలుబంగారువజ్రాల భూషణముల పొంకముమీర నలంకరించి
ముద్దుమోముల తిల్కములదిద్ది కలపముల్ చిరుతమేనులకు మచ్చికనలంది

గీ. కరములకు ప్రీతి కుంకుమభరణములిచ్చి పాదులను తోడొసంగి ముత్తైదువులను
పసుపుకుంకుమంకు బిల్వ బాలికలను బంపుచుండిరి నవరాత్రిపండుగులను.

గీ. విరులకొండెకుజుట్టి బల్వంతసాగను నీరువామంబునిచి పులిగోరుపెట్టి
కట్టుదట్టీనిగట్టి గోపాలవేషధారిణి యొకర్తు రథ్యల దరలెవేడ్క.

గీ. మేల్మిరతనంపుసొమ్ములు మేనమంచి మిసిమిపరోద్యదకొం గరముమగు వైచి
పాదముల నందియలుమ్రోయ బాలయొకతె రాధికావేషమునవచ్చె వీధివెంట.

గీ. తాను గృహలక్ష్మి గాన రథ్యలజరింప దగదటంచని దేవి ప్యాంతమునదలచి
బాలికారూపములు వేనవేలుదాల్చి అలరి వీధులజరియించు ననగదోచె.

ఉ. అంగనలెల్ల మేల్మి సరిగంచుదుకూలములన్ ధరించియున్
బంగరుభూషలన్ కనులపండువుగా నలరించిమోములన్
రంగుగ కుంకుమంబులిడి రమ్యసుగంధము మైనలంది యు
ప్పొంగుచు పేరటంబులకు బోదురు వీధులవెంట వేడుకన్.

సీ. ఇంటింటి ద్వైయుడున తెలమిబూజించిన పసపు పై పసపు పెంపెసగుచుండ
కమ్మతావులు దిశల్ గ్రమ్మ చందనము పై పైపైని మెంపూత వరీధవిల్ల
మురిపెంపుమోముల హదులైన కుంకుమబొట్టుపైబొట్టు సొంపులువటింప
విరజాజిసరులు చల్విధనుమంబులతోడ పైపైనితుగుముల పరిమళింప

గీ. పండ్లు తాంబూలములు పచ్చిపసపులాదుల చక్కగానుంచి బుడుతలచంక బెట్టి
మగుడ జేజేగ తమతమ మందిరముల జేరవత్తురు నవరాత్రి పేరటాండ్రు.

గీ. బాలికల బొమ్మకొల్వుల ప్రాభవములు బాలుర సరస్వతీపూజవైభవములు
చెలగు నాయుధపూజా విశేషములను గలిగి నవరాత్రిపండుగుల్ చెలువమెసగె॥



జీర్ణ కు సు మ సం తా ప ము

# నేఁటి స్త్రీల కర్తవ్యము

శ్రీమతి పింజమూరి వెంకటరత్నమ్మగారు.

స్త్రీని, ముఖ్యముగా భారతీయస్త్రీని, పట్టిచీఁకటిగా చేసినారు. దానికి మనము సిగ్గుపడవలసిన అవసరములేదు. అంధకారము సృష్ట్యాదినుండియు లోకానికి అమూల్యమైన వరము. ఆనందముకొఱకు సుఖము దుఃఖమును చేపట్టవలసివచ్చినది. "సృష్టి కొఱకు, తేజస్సు తిమిరమునే పాణిగ్రహణము చేసుకొనుచున్నది" అని కవిసమ్రాట్టు రవీంద్రనాథుని సుభాషితమఁట.

అని చెప్పి స్త్రీని అంధకారముగానే ఉండుమనను. ఇక్కడ అంధకారమనిన, అజ్ఞానమన్న మాటకాదు. కొంతవఱకు అనుసరణము, పూర్తిగా అడఁకువ. "అడఁకువ ఆత్మగౌరవరాహిత్యమును గాదు, నైచ్యమును గాదు" అని గాంధీమహాత్ముని జీవితము ఉపదేశించుచున్నది.

"పూవు, తన రేకులనన్నిటిని రాల్చివేయును; కనుక ఫలముపొందును, లేక సాధించును" అని ఒక మహాకవి పాడినాఁడు. ఈలాగున తన లావణ్యము, తన జీవము, తన సర్వస్వము రాల్చుకొనుటవలననే, ఇట్టి తీక్ష్ణమైన త్యాగమువలననే స్త్రీ, పురుషుఁడు పొందలేని ఫలమును సాధించును; సాక్షాచ్ఛివుని సగముశరీరమగును; శ్రీహరిహృదయసింహాసనము అధిష్ఠించును; బ్రహ్మదేవుని శిరస్సులలో దూఱి మాటలాడించును; మామూలు మాటలో మొదలుకొని, మోక్షద్వారముదాఁక తానే ముందు నడచును. ఇదే భగవద్గీతలోని నిష్కామయోగము, మహాత్ముల నిష్కామయోగము, ఆర్యావర్తమును అఖిలదేశశిరోమణిగా అలంకరించిన మహచ్ఛక్తి, వేదకాలము మొదలుకొని వెల్లదొరలకాలము వఱకు, ఈశక్తియే మనలను ఆ హిమాలయ శిఖరముమీఁద ఉంచినది. కాని యీశక్తి మాత్రము అనసూయారుంధతులు మొదలుకొని నేఁటి అసహాయోద్యమపు వీరవనితల వఱకు, భారతదేశపు స్త్రీలదేయని బుద్ధిమంతుల అందఱి అభిప్రాయమును.

"ఆది జనకుండు, పిమ్మట సతిపుఁ, డవల
తనయుఁడును, శాసకుల్ గదా, వనితకవ్వె
న్నఁడేనియు స్వాతంత్ర్య మున్నదయ్యె?"

అని లోకమనుచుండఁగా, తాను నవ్వుకొనును, అవుననును. తనకు స్వాతంత్ర్యమున్న నేదియో, స్వార్థమున్న నేదియో, సహజవర్తనమున్న నేదియో, స్వచ్ఛందవృత్తియున్న నేదియో, నాఁటినుండి నేఁటివఱకుఁ దెలియును.

పురుషుఁడు నిరంకుశాధికారియై నిష్కారణముగ పీడించినప్పుడు, "అతఁడు భగవంతుని పాదపూజాప్రసూనములనే తన హస్తమునఁ గోసికొని, వానిని మాలగా అల్లుకొనుచున్నాఁడు" అనికూడ గ్రహించుకొని, ఓరిమితో వేచియుండును. స్త్రీ, "అతిరసఫలభారగురుత" గాంచిన తరువు. "నింగి వ్రేలుచు నమృతమొసంగు మేఘము."

అందువలననే, ఔద్ధత్యము లేకుండఁగనే, ఆకాశమందుకొనుచున్నది.

అందఱికన్న గొప్పస్త్రీ భూదేవి. ఆమె క్షమ. కాని, ఒక్కమాట. నేఁటి మన దేశస్త్రీలు కొందఱిలో ఒక లోపము కనుపడుచున్నదేమో! అది పాశ్చాత్యసీమల నుండి వచ్చిన అంటువ్యాధి. స్వతంత్రజీవనము వేరు, సహధర్మచారిణి కాకుండఁబోవుట వేరు. "జీవిత కాలములో ఇతరులాడవలసిన భూమిక లేవో మఱచిపోవుట వలన, నా భూమికయొక్క అర్థముకూడ నేను మఱచిపోవుచున్నాను" అని ఒక మహామేధావి వ్రాసినాఁడు. అట్టి మఱపులో వారు పడిపోయినారని నా యభిప్రాయము. వా రొనర్చుచున్న పనులఁగూర్చి నేను తెప్ప నిచ్చగింపను. లోకకల్యాణమునకు, మానవశ్రేయస్సునకు, దేశాభివృద్ధికి, సంఘనిర్మాణమునకు, కుటుంబపవిత్రతకు, వలయు విద్య, వివేకము, స్వాతంత్ర్యము, హక్కు, మనము సంపాదించుకొనవలయును. అంతే. అప్పుడు ప్రతిగృహమును, "ఆర్ణోరాశిపరీత భూభువనమధ్య స్వర్గఖండ" మవును. కనుక, అప్పుడే లోకమంతయు బృందావనమగును, వైకుంఠధామమగును.



## వ్రతాంతము

ఊటుకూరు సత్యనారాయణరావుగారు

ఇటులనే గడచిపోయె ఎన్నెన్నొనాళ్ళు
శీతలశరన్నిశోపవాసాతిదీన
దుస్సహా భవద్వ్రతంబున తూలిపోయి
జీవితపు గడియలన్ని నిశ్శ్రీకమాచు.
ఎన్నడీ యనంతతృష్ణ యాగిపోవు!
హృదయముపగిల్చి, దాన నదించు నా గ
వోష్ణరమ్యము; రక్తనాళోద్ధమాచు
ఉబికుబికి వెల్లువలుగట్టె నొక్కమారు
ప్రణయరసమెల్ల; నీదివ్యపాదసవిధ
సీమలాశ్రయించి నిన్ను దర్శించ లేక,
ఏల యీగుండె యింతలో ప్రేలిపోదు!!

# కుటుంబమే స్వర్గము

ప॥ కృ॥ మూర్తిగారు

గీ॥ తనిపిరే వేల్పు లుదధిరత్నములచేత|
వెరచిరే ఘోరకాకోలవిషముచేత|
విడచిరే యత్నమమృతంబు వొడముదనుక|
నిశ్చితార్థంబు వదలరు నిపుణమతులు॥"

—భర్తృహరి.

శ్రీమతి ఎ. జానకమ్మగారను నొక కన్యకామణి హైకోర్టు న్యాయవాదిగా సమూదుకాఁబడినయట్లు గత నెల మధ్య హిందూపత్రికయందుఁ జదివి ఆమె జీవిత సంగ్రహమును సంపాదించి, మన యాంధ్ర సోదరీమణులకు నివేదింతుఁగాక యని సంకల్పించి వారి యింటికిఁబోతిని. హైకోర్టు వకీళ్లలోఁ బ్రసిద్ధులగు శ్రీమాన్ యం. యె. శ్రీనివాసయ్యంగారి కుమార్తెయే యీ శ్రీమతి జానకిఅమ్మగారు. శ్రీ అయ్యంగారు సన్నాదరించి తమ బిడ్డలఁ జూపించిరి. శ్రీ జానకమ్మగారే గాక యీమె తరువాతఁ బుట్టిన ముగ్గు రాడుబిడ్డలునుగూడ బి. యే.లు ప్యాసై యున్నారు. అందులో శ్రీ జానికమ్మగారి తరువాతి యామె, ఎప్రెంటిస్ కోర్సు * పూర్తిచేసి పరీక్షకుఁ బోనున్నది. ఈమె తరువాతి యామె ఎప్రెంటిస్ కోర్సున శిక్షణ బడయుచున్నది; కడసరి చెల్లెలు బి.యల్. క్లాసులోఁ జదువుచున్నది. ఆహా! ఆ తలిదండ్రుల భాగ్యమెంతె యనవచ్చును! ఈ సంచికయందు వారందరి ఛాయాపటములును సనామములై చిత్రింపఁబడియున్నవి. మరియు నా పుణ్య దంపతులు ఈ బిడ్డలందరితోఁ గూర్చున్న ఛాయాపటముగూడ దీననున్నది. ఇంతే కాక "మీ యనుభవజ్ఞానము నొక వ్యాసముగా వ్రాసి లోకమునకుఁ బ్రసాదింపుఁ" డని నేను గోరినవెంటనే వారదివ్రాసి దయచేయించిరి. అదియును భాషాంతరీకరింపఁబడి యిందు ప్రకటితమై యొప్పుచున్నది. పాఠకలోక మీ యంశమును దిలకించి యానందింత్రుగాక!

"బాలికల విద్యాభ్యాసముఁ గూర్చి మీ యనుభవమును దెలియఁజేయుడని గృహలక్ష్మి సంపాదకులు నన్నుఁ గోరిరి. నేను నట్లే యంటిని. మన యాడుబిడ్డల దుస్థితినిఁ గూర్చియు, దానిఁ జక్కఁజేయుటకుఁగల మార్గములంగూర్చియు నాకుండిన యభిప్రాయములు, నా యనుభవమువలన మరింత బలపడినవి.

నేను, యఫ్.యే. క్లాసులోఁ జదువుచుండినపుడు, మా వైష్ణవశాఖయందుఁ బండ్రెండేండ్ల బాలికయొకతె, పెండ్లియైన యొకటి రెండు వారములలోనే పాపము

* బి.యె. బి.ఎల్. పరీక్షలందుత్తీర్ణులయిన పిమ్మట అనుభవశాలులగు న్యాయవాదులవద్ద శిక్షణబడయుటకు ఎప్రెంటిస్ కోర్సు అందురు.

వితంతువైనది. ఇది వినఁగానే నా గుండె బ్రద్దలైనది. "ఈ ఘోరస్థితినుండి యీ మా పిల్లల నుద్ధరింపలేమా" యని నేనును నా తోడి మఱికొందఱు విద్యార్థులును తీవ్రాలోచనలఁజేయ నారంభించితిమి. ఆవెంటనే యొకమీటింగేర్పాటుసేయఁబడినది. మా హృదయవేదన మా పెద్దవాండ్లకేమి తెలియును? "ఇటువంటి యనవసరపు టధిక ప్రసంగములు చేసి కొంపమీఁదికిఁ దేవల"దని వారు మమ్ము గట్టిగాఁ జీవాట్లు పెట్ట నారంభించిరి. ఆకాలములో మేము చేయఁగలిగిన దేదియు లేకున్నను, సంఘమునందప్పుడప్పుడు వినఁబడుచున్న యిట్టి ఘోరవార్తలు, మా యుద్రేకమును మాత్రము రేపుచుండినవి.

కాలక్రమమున నా కార్గురాడపిల్లలును ఒక మగవాఁడును గల్గిరి. నేను చిన్నప్పటినుండియును మొండితనము గలవాఁడనగుటఁ జేసి "వీఁడు కులాచారములను గాలఁద్రోసి ఆడుబిడ్డల నధోగతులపాలు సేయునేమో" యని మాతల్లి, గుండెలడలఁ జేసికొనుచుండెను. కాబట్టి యాపె బ్రతికియుండఁగనే మొదటి యిద్దరి బిడ్డలకు ముడి పెట్టించినది. ఈ వివాహములు చేసి నేనును నా భార్యయుఁ బొందిన యనుభవములు, శ్రీహరీ, మా పగవారికైన మేము కోరము. అది యట్లుండఁగాక.

ఆదెబ్బతోఁ "బ్రపంచక మెల్లఁ దల్లక్రిందు లగుఁగాక, కాని యీ మిగిలిన కూతుండ్ల వివాహవిషయమును స్వప్నమందైనఁ దలంపవల"దని నేనును నా యిల్లాలును దృఢనిశ్చయము జేసికొంటిమి.

సోదరీమణులారా, యిచట నొక చిన్న ముచ్చట జెప్పి యావల నా తరువాతి కథకు వత్తును. ఒక యుపాధ్యాయుఁడు, "మన కెప్పుడు గడుపునింపి కట్టుకొనుటకు వెచ్చని గుడ్డలనిచ్చు జంతువేది?" యని ప్రశ్నించెను. అపు డొక బాలిక చప్పున లేచి 'అప్ప' (తండ్రి) యని బదులిడెను. ఎంత తమాషాగానున్నను ఈ ప్రత్యుత్తరము కుటుంబయాత్రయందుఁ బరమసూనృతమే కదా! సర్వత్ర బిడ్డలఁ బెంచి పెద్దవారలఁ జేసి, మంచి చెడ్డలఁ దెలుపుచు వారియందు నెల్లవేళల సానుభూతిగలిగి వారి నుచ్చస్థితికిఁ దెచ్చుటకుఁ దండ్రియే, ముందు తల్లిగా మారిపోవలయును. లేకున్న వ్యవహారము కుదురదు. తల్లి మారనక్కరలేదు. ఆమెకీగుణములు స్వభావసిద్ధములే. ఐనను, ఆమె మాత్రము సనాతనాచారసంకుచితస్వభావ కాగూడదు. అదృష్టవశమున నాకంటె విశాలతరహృదయయైనది నా భార్య. కాఁబట్టియే నా యాటలు సాగినవి.

"పిల్లలకుఁ బెండ్లిండ్లు వద్దు. వారిని జదివించి తీరవలయు"నని మే మాలుమగలము ఆఖరు నిశ్చయముఁ జేసికొంటకు ముందుఁ గీర్తిశేషుఁడైన మహనీయుఁడు జి. సుబ్రహ్మణ్య అయ్యరుగారితో సలహా చేసితిని. ఆ పుణ్యాత్ముఁడు "మూఁడు మాటలు కొంగున ముడివైచుకొమ్మని" సెలవిచ్చెను:—

1. సాధారణముగా దినమున కొకరూక వెచ్చముసేయునపుడు పండగలు పర్వదినములందు మఱినాల్గణాలు వ్యయముచేయ సిద్ధుఁడ వగుము.

న్యాయవాదినీ సహోదరీమణులు



శ్రీమతి. యం. ఎ. యదుగిరికన్య
బి.యె. బి.యల్.,



శ్రీమతి యం. ఎ. కృష్ణమ్మకన్య
బి.యె. బి.యల్.,



శ్రీమతి. యం.ఎ జానకీకన్య బి.ఎ.బి.యల్
అడ్వొకేట్



శ్రీమతి యం. ఎ. రుక్మిణీకన్య బి.యె.
(ఈమె బి. యల్. క్లాసులో
చదువుచున్నారు)

# మాతృస్తవము

దేవగాంధారీరాగము

పల్లవి.

ప్రేమపూతా, మాతా, సుచరితా ॥

చరణములు.

సకలచరాచర నికరాకారే
వికసిత సురుచిర ఘనవనవారే
అకలంకే విమలోదకపూరే. ప్రే॥

ఫలభర వినమిత తరువర మాలే
సులలిత శుకపిక కలరవ మూలే
మలయోత్పన్న సమీరణ లోలే. ప్రే॥

కోమల కలమ కదంబక కాంతే
సోమ సుమాన్విత కుంతలప్రాంతే
రమణీయోజ్జ్వల రత్న స్వాంతే. ప్రే॥

మధురరవశ్రుతి వచన విలాసే
విధురిత తిమిర సమూహ వికాసే
అధరీకృత పరదేశ మహాశే. ప్రే॥

సితముఖ పశుబల పీడితకాయే
శాత మహోన్నత ధర్మనికాయే
అతిధీరే జయ పావని గేయే. ప్రే॥

శ్రీమతి ఎ. కోమలమ్మగారు

# చిన్నిగృహాలక్ష్మి

సీ॥ అఖిలభూజనముల కల్లారుముద్దుగా
    అల్లిబిల్లగుచు వర్ధిల్లుమమ్మ
జిలిబిలిమాటల చిన్నిపద్దెంబుల
    ప్రౌఢంపుబల్కుల బరగుమమ్మ
అవనిచిరంజీవివై నిత్యసౌభాగ్య
    వైభవంబులుగల్గి వరలుమమ్మ
ఎలమి కాంతామతల్లులకెల్ల నారోగ్య
    భాగ్యంబులొసగుచు బరగుమమ్మ
గీ॥ నిండుదసరాదినంబుల పండుగులకు
బుధులొసంగెడి దీవనల్పొంది వేడ్క
ధరణి పెంపొంది తామరతంపరట్ల
చిన్ని గృహాలక్ష్మి యభివృద్ధిజెందుమమ్మ॥

# గృహలక్ష్మి కొక మాట

శ్రీసావిలక్ష్మి నారాయణమూర్తిగారు, బి ఏ.

మాయింటికరుదెంచి మాగృహిణులకెల్ల సలఘుసతీధర్మములనుగఱపి
ప్రణయార్ద్రభావ పరంపరావీచికా డోలికాపాళుల లీలనూచి
శిశువులబెంచి సచ్ఛిణంబునొసంగు మాతృధర్మంముల రీతి తెలిపి
వీరపత్నీమణీ సారచరిత్రాంశ కలితపవిత్రగాథలనుచెప్పి.

మురిపెములమూటవై ప్రౌఢసరసరీతి
నిరుపమానందదాయివై నెగడుచుంట
ఆరుసంవత్సరాలవయస్సు లేని
నీకు "గృహలక్ష్మి" యెటులబ్బె ప్రాకటముగ.

నినుగని నీదుముచ్చటల నిత్యము వీనులవిందుగాగ నె
మ్మనమున నుత్సుకంబొదవ మాగృహలక్ష్ములు నీదురాకకై
అనిశముజూచుచుండిన సహా నెలకీవొకమారె వత్తు వీ
ఫణితిరయొకింపుకేనియును భావ్యమొకో "గృహలక్ష్మి!" చూడుమా!

మహిళామండలికెల్ల సభ్యుదయ మమ్మా! యెప్పుడున్ గూర్చుచున్
మహిలో నెల్లెడ సాటివారల సమందప్రాభవోపేతవై
మిహిరాంశూదయమబ్ధికట్లు గృహలక్ష్మి! మానినీరాజికిన్
రహినత్యంతముదంబుగూర్చి కలకాలంబీవు వర్ధిల్లుమా!

* *

# ఆశీర్వాదము

బాలకవి:-వత్సవాయి సత్యనారాయణవర్మగారు

తే॥ గీ॥ శ్రీరఘుకులభూషణుఁడు నీ శ్రేయమునకు
సత్కృపావీక్షణములను సంతసమున
నిడుపుగాఁ జూప "గృహలక్ష్మి" నేను మిగుల
ప్రార్థనలు జేయుచుంటినే! పవలు రేయి.

తే॥ గీ॥ పత్రికల వెన్నియో యాంధ్రభాషలోన
ప్రచురమగుచుండె, వాటిని ప్రతిదినంబు
గాంచుచుంటి సత్ప్రీతి, నీఖ్యాతి వినియు
జదివితిని నిన్ను నొకనాఁడు సాంతముగను॥

సీ॥ సంపాదకీయంపు చతురతగాంచగా నిక్కంబుగను నీకు నీవెసాటి!
కవితాఘనత్వంపు ఖ్యాతి విశ్వమునపట్ల నిక్కంబుగను నీకు నీవెసాటి!
ఆంధ్రభాషామాత కధిక సేవను జేయ నిక్కంబుగను నీకు నీవెసాటి!
సోదరీమణులకు సుగుణముల్ సమకూర్ప నిక్కంబుగను నీకు నీవెసాటి!

యెల్లప్పుడు సదాశ్వాసంబు తెలివితోడ
పరుల దూషణ లేకను ప్రచురపఱచి
పాఠకుల మన్ననలకును పాత్రురాల
వగుచు వరలుమ "గృహలక్ష్మి"! యనవరతము॥

* *
*

కళ్యాణి—ఖండగతి

అమ్మ రావమ్మా ॥

అమ్మ రావమ్మ తులశమ్మ మముఁగాపాడ ।
వమ్మ సతతము పదము— లే నమ్మినా ॥ అమ్మ ॥
ఇమ్మహినీవిహప—రమ్ములొసగుదువనుచు
కమ్మవిలుతునితండ్రి—కలనైన బాయఁడట॥ అమ॥
నీ మృదుతనువును గని—నీ పరిమళమును గొని ।
నీ మహాత్మ్యమును విని—నీరజాక్షి !
తామరసదళనేత్రి—త్యాగరాజుని మిత్రి ।
ప్రేమతో శిరమునను—బెట్టుకొన్నాడట ॥ అమ్మ ॥

# ఏడీ? — ఏమైపోయాడో!!

శ్రీమతి శోలాప్రగడ సత్యకళాదేవిగారు

సాయంకాల మయిదు గంటలయింది. చల్లని పిల్ల గాడ్పులు వీస్తున్నాయి. మేడమీద దక్షిణపునైపు గది. గదిలో వొక టేబిల్ (Table), రెండుకుర్చీలు వున్నాయి. టేబిల్ మీద రెండుపుస్తకాలు మాత్ర మున్నాయి. కిటికీదగ్గిరగావున్న మంచంమీద పడు కుని విజయుడు నిద్రపోతున్నాడు. ఒథెల్లోడ్రామా (Othallo Drama) తెరచి విజయుని ప్రక్కమీద వుంది. కాగితాలు గాలికి అటూయిటూ కొట్టుకుంటు న్నాయి. విజయుని ముఖంమీద చిందులాడుతూ వున్న ముంగురులను సూర్యకిరణాలు ముద్దుపెట్టుకుంటు న్నాయి. సూర్యకాంతి విజయుని పచ్చనిశరీరానికి మరింత వన్నె తెచ్చిపెడుతూంది. రెండుచేతులూ గుండెలమీద పెట్టుకుని నిశ్చింతగా నిద్రపోతున్నాడు. ఇంతలోకే "విజయా!" అని పిలుపు వినబడ్డది. కళ్లు తెరచి చూశాడు. నవ్వుతూ సరోజిని నుంచునుంది. లేతగులాబిరంగుచీర కట్టుకునుంది. పొడుగైనజుట్టు సగంవరకూఅల్లి ఆకుపచ్చరిబ్బన్ (Ribbon) ముడేసి వుంది. మెడలోని సన్నగొలుసు పైటమీదనుంచి వేలాడుతూంది. చెవులకు లోలకులూ చేతులకు రెండు జతల గాజులూ మాత్రం వున్నాయి. కాళ్లకి జరీపని చేసిన నీలిరంగు మఖ్మల్ స్లిప్పర్సు (Slippers) వున్నాయి. సరోజిని పదహారుకంటె యెక్కువ వుండదు. ముఖము అంతగుండ్రనిదికాదు. రంగులో విజయుణ్ని మించుకుందిగాని తీసిపోదు. ఈమూర్తి విజయుడికి కనిపించడంతోటే నిద్రమత్తు వదిలి పోయింది.

విజ—రోజా! యెంతసేపైంది నువ్వొచ్చి?

సరో—యెంతసేపో కాలేదు గాని-అయినా దాటి పోతూన్నా మెలకువరాలేదూ? నన్ను నాలుగు న్నరకే రమ్మన్నావే—షికారుకోసం!

విజ—నిద్ర బాగా పట్టిపోయింది. తెలివిరాలేదు.

సరో—పగలూ రాత్రీ కూడా నిద్రకింద సరిపోతే—పరీక్షెల్లా ప్యాసవుతావు?

విజ—యేమిటో—నిద్ర పట్టింది. దాని కేంచెయ్యమం టావు! మావాళ్లిలాగే ప్రాణాలు కొరికేవారు. కన్నుమూసేసరికి కర్రతీసుకొచ్చేవాడు మాతండ్రి. పొరుగూరులో చదువుపెట్టానుగదా అని తలతడివి చూసుకుంటుంటే నువ్వు పట్టించావేమిటి నా తాళం?

సరో—అవును—నా కెందుకు! అడగటం నాదితప్పే. (అంటూ రెండడుగు లేసింది.)

విజ—వచ్చిందీ కోపం? వెళ్లకు—రోజా! నవ్వు టాలకంటేకూడా కోపం తెచ్చుకుంటావేం? యిలా వచ్చి కుర్చీలో కూచో. అట్టే ఆలస్యంలేదు; నేనూ వచ్చేస్తున్నా. అవును గాని, మోహనుడింకా రాలేదెందు చేతనో?

సరో—నేను చూస్తొచ్చాను; మోహను డెక్కడి కెళ్లాడో గాని, గది తాళంవేసుంది.

విజ—పోస్టాఫీసునుంచి యింకా రాలేదూ?

సరో—పోస్టాఫీసు కెందుకూ? అసలువెళ్లడమే నేను చూడలేదు.

విజ—వాళ్లవాళ్ల దగ్గిరనుంచి మనిఆర్డరు (Money order) వచ్చింది కాబోలు. పోస్టుబంట్రోతు రెండు మూడు మాట్లు వచ్చి తిరిగిపోయాడు. అందుకోసం రెండు గంటలకే వెళ్లాడు. యేముం ది! యిలాంటి వూళ్లలో డబ్బుతో వుంది పని. ఒకరోజు యిటూ అటూ అయినా, హాస్టెల్ (Hostel) వాళ్లు మంచివాళ్లు గనుక స్టూడెంట్లు (Students) పుచ్చెపూస్తుంది. అయినా నీకు పర్వాలేదులే; రెండు రోజులు ముందుగానే వస్తుంది నీకు మనీఆర్డరు.

సరో—అదుగో! మాటలోనే వచ్చాడు—మోహ నుడు. ఏం మోహనా! చాలా త్వరగావచ్చావే!

మోహనుడు చామనిఛాయ; కొంచెం సన్నని మనిషనే చెప్పొచ్చు; యిరవైయేళ్లకంటె యెక్కు-

వుందవు. కళ్లకి నల్లనికాడలుగల స్పెక్టకిల్సు (Spectacles) కూడా ఆమొహానికి అందంగానే వున్నాయి. నవ్యముఖం—నవీననాగరికులలో మొదటి వాడులాగు కనుబడుతాడు. మొత్తంమీద అందమైనవాడనే అనుకోవచ్చు. విజయమోహనుల కిద్దరికి సమానవయస్సేగాని, విజయుడే పెద్దవాడులాగు కనబడతాడు.

మోహ—వస్తుంటే దారిలో తెలిసున్నవాళ్లు కనబడి వాళ్లింటికి తీసుకెళ్లారు. వాళ్లెంతసేపటికీ జలగల్లాగు వదిలిపెట్టలేదు. అంచేత ఆలస్యమయింది. ఏదీ! ఈతన వ్యవహార మింకా తేలదువ్యవహం దగ్గరేవుందే!

విజ—అబ్బే—నాకేం ఆలస్యంలేదోయి. నువ్వింకా రాలేదనే వూరుకున్నా.

మోహ—నేనొచ్చి దువ్వుతాననుకున్నావా?

సరో—అదికాదు—మోహనా! నేను లేచేవరకూ నిద్రలేవలేదు.

మోహ—అలాచెప్పు నాయనా! నీ స్వభావం నే నెరగనూ! నేరం నీమీదుంచుకోకుండా యెవడి నెత్తినైనా రుద్దెయ్యటానికి నీయంతవాడు లేడు.

సరో—చిన్నతనాన్నుంచీ యెరిగున్న మనదగ్గిరే యింత నాటకమాడుతున్నాడు—కొత్తవాళ్లదగ్గి రెల్లా నటిస్తాడో!

విజ—పదండి—నా ఆలస్యంలేదు.

మోహ—ఇంకెందుకు? అరవుతోంది. ఇకవెళ్లట మెప్పుడు—రావట మెప్పుడు? ఒకవేళ వెళ్లినా రావటం కొంచె మాలస్యమైతే గేటుబిగించు కూర్చుని, యీ సాంబారుగాడు చచ్చినా తాళం తియ్యడు. చల్లనిగాలేస్తూంది—యీ వసారాలోనే కూచుందాం పదండి.

సరో—అవును విజయా! మోహనుడు చెప్పిన సలహా బాగానేవుంది. చాపకూడా వేసేవుంది—అక్కడే కూచుందాం.

మోహ—అయ్యో! మావాడు పాపం కష్టపడి క్రాపింగు దువ్వాడు—అందుకోసం ఆలోచిస్తున్నట్టున్నాడు.

విజ—నీ మొహంలాగుంది—ప్రతిదానికీ హాస్యమే. మంచినీళ్లు తాగటానికి గ్లాసెక్కడుందో అని వెతుకుతుంటేను?

మోహ—మన యింకా యీగదిలో నేపడే మగ్గుతున్నాం, సరోజిని అప్పుడే వెళ్లి చల్లగాల్లో కూచుంది.

విజయుడు మంచినీళ్లు త్రాగి, సిగరెట్టు ముట్టించాడు. అడ్వర్టైజిమెంట్సు (Advertisements) తోను, సినిమాపిక్చర్ల (Cinema pictures)తోను నిండిన మేగజైను (Magazine) ఒకటి పట్టుకుని విజయమోహనులు వసారాలోకెళ్లారు. సరోజిని పూలమొక్కలవంక చూస్తూ కూర్చున్నది. సరోజినీ మోహనవిజయులు ముగ్గురూ చాపమీద వరుసగా కూర్చున్నారు.

విజ—మోహనా! నువ్వూరికే కూచుంటే బాగుండలేదు. ఇదుగో!

మోహ—నా కలవాటులేదు. నన్ను చంపకు నాయనా! నీకు పుణ్యంవుంటుంది.

విజ—ఒకమాటు కాలిస్తేసరి—అదే అలవాటవుతుంది.

మోహ—ఏం మునిగిపోయింది—దిక్కుమాలిన పొగ ముక్కునా నోటా వదులుకుంటూ. అంత బాధపడి అలవాటుచేసుకోవడ మెందుకు?

విజ—సిగరెట్టు కాల్చడంకూడా ఒకవిధమైన దర్జా లక్షణమే—తెలుసునా?

మోహ—అధ్వాన్నం—యెందుచేతనో నీ పెదవులింకా యెర్రగావున్నాయి గాని, సిగరెట్టు కాల్చేవాళ్లందరి పెదవులూ నల్లగా పొగచూరి పోయుంటాయి. అయినా యిప్పు డాట్టే సిగరెట్టు కాల్చేవాళ్లు కనపట్టంలేదు.

విజ—పోనీలే—బలవంతపెట్టడ మెందుకు? చెడని వారిని చెరపకూడదన్నారు—పెద్దలు. మన యిద్దరిలోనూ రెండుపద్ధతులు బాగుండలేదు.

నేనుకూడా క్రమంగా మానెయ్యడానికే ప్రయత్నిస్తాను. అవునుగాని—రోజా! యేమంత చదవతగినవున్నాయని—మేగజైనంత శ్రద్ధగా చూస్తున్నావు?

సరో—యేంచెయ్యను? మీ వాదోపవాదాలెంత సేపటికీ ముగియందే?

మోహ—ఇంకేదైనా సబ్జెక్టు (Subject) ఎత్తుకురూ, ఈగొడవ వొదిలిపెట్టి! ఏమోయి! సెలవులు దగ్గిర కొస్తున్నాయి. బి. యే. అయిపోయిన తర్వాతేం చదవాలనుకుంటున్నావు?

విజ—మన పూర్తైన తర్వాతి ఆలోచించకూడదూ? ఇప్పుడేలెందుకా ప్రసంగం?

మోహ—మన వూళ్లో నేను పదిరోజులకంటె యెక్కువుండను. మా అక్కగారి కూతురికి యీ సెలవుకాలములో వివాహంచేస్తారట. బహుశా నే నక్కడికెళ్లిపోవలసొస్తుంది. మళ్లీ మిమ్మల్నిద్దర్నీ యీవూళ్లో నేతప్ప కలుసుకోలేనేమో? నేనున్నా లేకపోయినా రోజాతో ఆలోచిస్తే నీకు మంచిసలహా యిస్తుందిలే.

విజ—మీ అక్కగారికూతుర్ని నీకే యిస్తారా?

మోహ—ఇస్తామన్నారు—గాని నేనే యిష్టపడలేదు.

విజ—పిల్ల బాగుండకనా?

మోహ—బాగుండకేం—చదువుకూడా బాగానే చదువుతూంది.

విజ—మరి నువ్వెందుకు చేసుకోవడంలేదూ?

మోహ—క్రాసెగ్జామినేషన్ (Cross examination) చేసి నన్నిల్లా చంపుతున్నావేమిటి? నాకా పిల్లను చేసుకోవడం యిష్టంలేదు. అవునుగాని-నేను చదువుమాటడిగితే యీ ప్రసంగంలోకి దింపావెందుకు?

విజ—ఏమో! రేపటిరోజు మనదికాదు—యేం చెప్పమంటావు?

సరో—విజయుడి నడిగితే యేసంగతీ తేలదు. యే విషయమడిగినా, ఫిలాసఫీ (Phylosophy)లోకి దింపుతాడు.

మోహ—ఇతనికేకాదు—చాలామందికుంది ఆగుణం. జవాబుచెప్పడాని కేమీతోచనప్పుడు వీలుగా దొరుకుతుంది—వాళ్లకీ ఫిలాసఫీ. వెర్రివేదాంతాలకేంగాని—అసలు నీ అభిప్రాయం చెప్పమా.

విజ—చెప్పేటందుకేముంది! అయితేంపూడి వుద్యోగంలాగ, ప్యాసై లేగియుతే నేనూ నీ అభిప్రాయంతోనే యేకీభవిస్తాను. యేదో బి. యల్. ప్యాసై బల్లకట్టుక్కూచుందాం. ఆ పైన భగవంతుడున్నాడు.

మోహ—కోర్టులోకూడా వేదాంతోపన్యాసం ప్రారంభించావంటే జడ్జీకి తలమండెత్తుకొచ్చి కేసులు తగలేస్తాడు. నీ సొమ్మేమీపోదుగాని పార్టీలకి క్షవరమవుతుంది.

విజ—సంపూర్ణంగా కాదులే.

మోహ—ఎందుచేత?

సరో—మూడు కోర్టులు ఉండడంవల్ల.

మోహ—ఒక్క కోర్టులో వ్యాజ్యంపొయ్యేసరికే పార్టీకి కాళ్లు చల్లబడతాయి. ఇన్ని కోర్టులెక్కడ తిరగగలడు?

విజ—రోజా! నీకేం చదవాలనుంది?

మోహ—డాక్టరీ చదువుతుందేమో?

సరో—నేనింకా ఇంటరుజూనియర్ (Inter junior)లో నేవున్నాను కాదూ—నన్నెందుకూ అడగడం?

మోహ—ఉద్దేశం చెప్పొచ్చుగా!

సరో—నాకు డాక్టరీమీద యిష్టంలేదు. లాయరీమీదే వుంది దృష్టి నాకూను.

మోహ—ఇప్పుడు ఆడవాళ్లు చాలామందున్నారు లాయర్లు (Lawyers)లో. వీళ్లెక్కువవుతున్న కొద్దీ మగవాళ్ల ప్రాక్టీసు (Practice) పడిపోతూంది. అసలు సరోజిని వకీలు (Vakil)కే తగివుంటుంది.

విజ—మనమిత్రులలోకి వకీలుపనిలో యెవరు తెలివైనవా రనిపించుకుంటారో చెప్పు.

మోహ—దాని కాలోచనెందుకు—మనలోకి బెస్టు వకీల్ (Best Vakil) అనిపించుకునేది సరోజనే.

విజ—అదుగో! భోజనానికి రమ్మని కాబోలు బెల్ (Bell) కొట్టారు.

సరో—నాగదికూడా తాళంవేస్తాను. అదేమిటి! నాగదిలో లైటు (Light) వెలుగుతూందే!

విజ—ఇందిరా, విమలా షికారునుంచి వచ్చుంటారు. వాళ్ళు వెలిగించారేమో!

సరో—వాళ్ళుషికారెళ్ళలేదు-బంధువులింటికెళ్ళారు-నన్నుకూడా పిలిచారుగాని, నేను వెళ్ళలేదు.

ఇందిర—ఇంకా మీరిక్కడే కూచున్నారేం-భోజనానికి రారూ? (అంటూ వసారాలోకివచ్చింది)

ఇందిరకు పదునెనిమిదేళ్ళుంటాయి. ఎరుపు కాకపోవడంచేత సరోజనంత రూపసిలాగు కనపడదు. కాని యావరేజ (Average) మీద అందమైనదే అనుకోవచ్చు. ఇందిర పిలవడంతోటే సరోజని గదికి తాళంవేసి వచ్చింది. నలుగురూకలిసి భోజనానికి వెళ్ళారు.

౨

సరోజని యీజీఛైరు (Easy chair) లో పడుకుని తదేకదీక్షగా పుస్తకం చదువుకుంటూంది. వక్షస్థలంతోపాటు పుస్తకంకూడా పైకీకిందికీ ఊగుతూవుంది. రిబ్బన్ (Ribbon) కట్టివున్న జడ ఒకపక్కనుంచి జారి నేలకు తగులుతూంది. మెడలోని గొలుసును యెడమచేతివేలికి చుట్టి చెయ్యి చెక్కిలిమీద పెట్టుకుంది. చిన్నచిన్న ముత్యాలులాగు ముఖంమీద చిరుచెమటలు పోస్తున్నాయి. బొట్టు లేకపోవడం చేత మచ్చలేని చంద్రబింబంలాగుంది ముఖం. ఎందువల్లనోగాని-చిరునవ్వుమాత్రం పెదవులమీదికొస్తూంది. ఈదృశ్యమంతా విజయుడు పక్కనునుంచుని చూస్తూ నేవున్నాడు. సరోజని, అంత క్రితము కాని మెరుపుతీగవలె కనబడుతూంది—విజయుడికి. రెప్ప వాల్చకుండాచూస్తున్నాడు. పుస్తకంచదువుకుంటూ తనలో తానే నవ్వుతూ నిర్మలహృదయంతో వున్న సరోజని చూడనేలేదు-విజయుణ్ని. ఇక నవ్వాపుకోలేక పోయింది కాబోలు—గట్టిగానవ్వింది.

విజ—అలా నవ్వుతున్నావేం—రోజా!

సరో—అబ్బా! యెవరో అనుకుని హడిలిపోయాను. నువ్వేనా! ఈపుస్తకం చదువుతూంటే నవ్వొస్తూంది. ఒక్కదాన్నీ చదువుతున్నా నవ్వాపుకోలేకుండా వున్నాను. అవును గాని-మూడు దాటినట్టుంది-యింకా కాఫీ పట్టుకురాలేదే!

విజ—నేనొచ్చేంతసేపైందో నీకు తెలుసునా?

సరో—అబ్బే—నేను చూడలేదు.

విజ—ఇక కాఫీ తెచ్చిందిమాత్రం నీకెల్లా తెలుస్తుంది? అరగంట కిందటే అందరి గదులలోనూ కాఫీ, ఫలహారం, పెట్టిపోయాడు. నేనూ మోహనుడు ఫలహారం పుచ్చుకుని తాంబూలంకూడా వేసుకున్నాం. నువ్వింకా యిలాగే కూర్చున్నావు. ఈగలు ముసురుతున్నాయని నేనే అల్మారులో పెట్టాను.

సరో—ఎంతదొంగవు! ఎక్కడా చప్పుడేకాలేదే!

విజ—ఇదుగో! (అంటూ ఫలహారం పళ్ళెమూ, కాఫీ కప్పూ తెచ్చియిచ్చాడు.)

మోహ—ఇవ్వాళ బ్రాహ్మడి డ్యూటీ (Duty) విజయబాబుగారు పుచ్చుకున్నారే (అంటూ గుమ్మంలోనుంచుని నవ్వుతున్నాడు.)

సరో—ఏం మోహనా! ప్రొద్దుటినుంచీ యిటువైపుకే రాలేదే నువ్వు?

మోహ—నేను రెండుమూడుసారు లొచ్చాను. నువ్వేదోచదువుకుంటున్నావు. డిస్టర్బ (Disturb) చేయడం యిష్టం లేక పలకరించకుండా వెళ్ళి పోయాను. అంటూ వచ్చి పక్కనున్న కుర్చీలో కూర్చున్నాడు.)

విజ—అలావూరుకుంటే సాయంకాలందాకా చదువుతూనే వుంటుంది. నేనొచ్చి చెప్పేవరకూ కాఫీ తెచ్చిపెట్టాడనే సంగతికూడా యెరగదు.

మోహ—అవును-యేటువంటిస్థితిలోవున్నా పలకరించగల ధైర్యం నీకుంది.

విజ—ధైర్యానికేం చిన్నప్పటినుంచీ మన మెరుగున్న సరోజనేగా!

మోహ—నీకున్నంత చనువు లేదు-సరోజినిదగ్గర—నాకు.

సరో—నువ్వు పలకరించినప్పుడెన్నడైనా విసుగుదల కనపర్చానా-మోహనా?

మోహ—లేదు గాని..

సరో—'కాని' అని ఆగటమెందుకు-చెప్పెయ్యి.

మోహ—అబ్బే-చెప్పటానికేముంది? నేనే జంకుతున్నాను-చనువు చేసుకోడానికి.

సరో—ఇక నాతప్పేముంది?

మోహ—ఎవరితప్పూ లేదుగాని- ఇవాళ సినిమా (Cinema) కు వెళదామా- చాలా బాగుంటుందిట?

సరో—విజయుడుకూడా వస్తే వెళదాం- విమల వెళదామంది.

విజ—రేపువెళ్లకూడదూ?

మోహ—రెండురోజుల్నించీ చెడగొట్టుతున్నావు. రేపుండదు. వెళితే యీపూటే వెళ్లాలి.

విజ—శెలవులుకూడా దగ్గిరకొస్తున్నాయి. మళ్లీ యెప్పటికో? బ్రతికిబాగుంటే రెండుమూడునెల్ల మాట. పోనీ—యివాళే వెళదాం.

మోహ—యేమీ అయిపోము—చాలా రోజులవరకు మనమిద్దరము వూగులాడుతునే వుంటాము—ముందెవరికి లభిస్తుందో గాని!

విజ—భాగ్యమా—బంగారమా—లభించలేదని విచార పడడానికి? మృత్యువుకోస మంత ముచ్చట పడడ మెందుకు?

మోహ—ఏమో—యిలా జీవిస్తూ అవస్థపడేకంటే తేల్చుకుంటే నే నయం.

విజ—తేల్చుకోడానికి మనచేతిలో వుందా?

సరో—మోహనా! జీవితంమీద విరక్తి కలిగేటంత అవస్థే మొచ్చింది నీకు?

మోహ—ప్రపంచంలో పుట్టడం పెరగడమే, గొప్ప అవస్థ.

సరో—చివరికి విజయుడి వేదాంతంలోకి నువ్వు కూడా దిగుతున్నావే? సరేకాని-విమలనుకూడా పిలుచుకొస్తాను—మీరు సిద్ధంగా వుండండి. (అంటూ లేచివెళ్లింది.)

సరోజిని నడచి వెళ్లుతున్నప్పుడు కూడా వీరిద్దరి నేత్రాలూ ఆవిడ వైపే చూస్తున్నాయి. కాని విజయుడి ముఖంలో ధైర్యము, మోహనుడి ముఖంలో నిరాశ కనుపడుచున్నవని మాత్రం ఒప్పుకోక తప్పదు. రెండు మూడు నిముషాల వరకూ యెవరూ మాట్లాడలేదు.

మోహ—నాకంటే నువ్వే అదృష్టవంతుడవోయి.

విజ—ఏవిషయంలో?

మోహ—తండ్రి ఉండడమే గొప్పఅదృష్టం—నీకు.

విజ—అవునులే కాని, తండ్రి లేకపోతేమాత్రం నీకేమి లోటు చేస్తున్నారు-మీవాళ్లు?

మోహ—అయినా నీదారి వేరు—నాదారి వేరు.

విజ—అదితప్ప నీకిప్పుడొచ్చిన లోటేముంది?

మోహ—ఏం? అది సామాన్యమైన లోటా?

విజ—దైవంచేసినదానికి మనమేమి చేయగలము? మోహనా? నువ్వుకూడా వెర్రిని పడుతున్నావేమిటి!

మోహ—ఒక్కొక్కప్పుడు నాకు దైవం ఉన్నాడా లేడా అని సందేహంకూడ కలుగుతూ వుంటుంది.

విజ—నువ్వింకా సందేహంలోనన్నా పడుతున్నావు. కొంతమంది అసలు భగవంతుడే లేడని దృఢపరుచుకున్నవాళ్లున్నారు. కాని, నిదానంమీద ఆ అభిప్రాయం మార్చుకున్నారు—చాలామంది.

మోహ—పెద్దపెద్ద కబుర్లేతప్ప, ఉన్నాడో లేడో యెవరు చూశారోయి?

విజ—ఆ డిస్కషన్ (Discussion) లోకి దిగితే యిప్పుడు తెమలదుకాని వదిలెయ్యి.

మోహ—పోనిలే—నాయనా! వేదాంతంలోకి దిగావంటే రొమ్ముకలు కొరికేస్తావు.

విమల—(సరోజని చేయిపట్టుకునివచ్చి) విజయబాబూ! టైము అయిపోతుంటే మీరు యింకా యిలాగే కూచున్నారేం?

మోహ—నాకేమీ ఆలస్యంలేదు–పైమీద ఖండువా వేసుకుని బయలుదేరటమే.
సరో—అయితే లేవండి.
విజ } మోహ } రెండునిముషాలు. (అంటూ లేచివెళ్లారు.)

సరోజిని అల్మారులోనుంచి రెండు తమలపాకులకిళ్లీలుతీసి ఒకటి విమలచేతిలో పెట్టింది. ఇద్దరూ నవ్వుతూ వసారాలోకివచ్చారు. గదికి తాళంవేసి విమల సరోజిని చేతికిచ్చింది తాళంచెవి.

విజ—ఇంకా ఆలోచిస్తూన్నారేం? నడవండి.
సరో—మీకోసమే నుంచున్నాం. మోహనుడేడీ?
విజ—అడుగో! అప్పుడేవెళ్లి గేటుదగ్గిర నుంచున్నాడు.
సరో—అయితే మనదేనా ఆలస్యం?

ముగ్గురూ మేడమెట్లుదిగి క్రిందికివెళ్లారు.

3

చక్కనివెన్నెల. "చలువగల వెన్నెలల చెలువునకు సౌరభము" అన్నట్లు మందమారుతముతో మిళితమై వచ్చేడి నైటుక్వీన్ (night queen) వాసన వెన్నెలదేమో ననిపిస్తూంది. కనుపడుటకు సిడియపడుచున్న క్రొత్త పెండ్లికుమార్తెలవలె నక్షత్రములు ఉండి ఉండి మినుకుమినుకు మంటున్నాయి. వీటి నడుమ కళాపూర్ణుడైన కుముదబాంధవుడు విలాసంగా విహరిస్తున్నాడు. రాకాసుధాకరుని రాజ్యంలో సుఖించనివారుందురా! డాబామీద సరోజినీ మోహన విజయులు ముగ్గురూ కూర్చొని హిమాంశుకిరణప్రసాద సౌఖ్యము ననుభవిస్తున్నారు.

మోహ—విజయా! మీవూరికెళ్లి వచ్చినప్పటినుంచి నువ్వు క్రొత్తమోస్తరుగా కనబడుతున్నావేం?
విజ—ఏం? యెలావున్నాను?
మోహ—ఏదో పెద్ద ఆలోచనలోవున్నట్టు కనబడుతున్నావు.
విజ—ఆ! ఆలోచనకేముంది!
మోహ—నీముఖంలో మునపటి వికాసంలేదు–యెందుచేతనో!
సరో—ఏదో బెంగ పెట్టుకున్న మనిషిలాగు కనబడుతున్నాడు.
విజ—ఒకవిధంగా బెంగగానే వుందిలే.
మోహ—నీకేమంత అవసరముందీ...ఒకవేళ వివాహాన్ని గురించి కాదుగద?
సరో—దానికింత విచారమెందుకు?

ఈమాట సరోజిని అనేసరికి, దాహమవుచున్న వానికి నీళ్లచెంబుధ్వని వినబడినట్లు ప్రాణం లేచి వచ్చింది-విజయుడికి.

విజ–మొన్న శలవల్లో వెళ్లినప్పుడు వివాహం చేసుకోమని చాలా బలవంతపెట్టారు–మావాళ్లు. తొందరపడవద్దని వాళ్లకినచ్చజెప్పి వచ్చేసరికి నాతల ప్రాణం తోకకొచ్చింది.
మోహ—వాళ్లకల్లాగో నచ్చజెప్పావుగా! యింకా విచారమెందుకు?
విజ—ఎంత సమాధానపరిచినా పెళ్ళిచేసుకునేవరకు నన్ను వదలిపెట్టేట్టులేరు.
సరో—చదువుపూర్తికాందే తొందరెందుకు నీకు–విజయా?
విజ—నాకేం తొందరుంది? మావాళ్లు నన్ను నిలవనియ్యడంలేదు. చివరకి యివాళవచ్చిన ఉత్తరంలో కూడా యిదేగొడవ!
మోహ—నీకిష్టం లేకపోతే నేనిప్పుడు చేసుకోనని చెప్పు. దీనికోస మింత దిగులుపడడమెందుకు?
విజ—అవును—నీకేం తెలుస్తుంది! నువ్వేదో మీ అమ్మమీద రెండుకాళ్ళు లేని కుక్కినపేనుచేసి కూచోపెట్టినట్టనుకున్నావు! నీలాగు సమాధానం చెప్పడానికి నాకు వీలవుతుందా?
మోహ—బలవంతపు బ్రాహ్మణార్థమా యేమిటి? నేనిప్పుడు చేసుకోనని చెప్పు. అలాచెప్పితే మీవాళ్లు మాత్రమేమంటారు?
విజ—అంత స్పష్టంగా నేను చెప్పలేను–మోహనా!
మోహ—సరే-అలా చెప్పడానికి ధైర్యంలేనప్పుడు వాళ్ళ యిష్టంప్రకారం నడుచుకోవడమే-ఇక దానికాలోచించడ మెందుకు?

సరో—మోహనా! ఏఆలోచనాలేకుండా తేల్చేసుకోడానికి యిదేమంతచిన్న విషయంలాగు కనబడుతూందా?

మోహ—నాకిష్టంలేదని చెప్పడానికికూడా ధైర్యంలేనివాళ్ళేమిచేస్తారు-యేదో ఒకటితేల్చుకోక? ఈయన ఆలోచిస్తూకూర్చోడాని కవకాశమిస్తారా-వాళ్ల వాళ్లు?

సరో—అయినా వాళ్ళకు తెలియాలిగాని, యెదిరించి తల్లిదండ్రులకు జవాబు చెప్పడం కష్టమే.

విజ—అందుకే వాళ్లకేమీ చెప్పలేకుండా వున్నాను. ఈసిట్యుయేషన్ (Situation)లో నేనెంత బాధపడుతున్నానో పరమేశ్వరుడికి తప్ప యింకెవ్వరికీ తెలియదు.

మోహ—అవునోయి— చెప్పలేకిమాట నిజమే. వాళ్లు మూర్ఖపుపట్టు పడతారు. అప్పుడేమి చేస్తావు?

విజ.—ఏదోవచ్చి చెప్పో, బ్రతిమాలో, ఒప్పుకునేటట్టు చేస్తాను.

మోహ—మూర్ఖులు నచ్చచెప్పినా వినరు. వాళ్లు అనుకున్నంతా అయితీరవలసిందే.

విజ—ఆ! అంత మూర్ఖులు కారులే.

మోహ—పోనీ—మీవాళ్లమాటకాదు—యింకొకళ్ల మాటనుకో.

విజ—అలాంటి వాళ్లుంటారా—యెక్కడైనా?

మోహ—లేకేం? వాళ్లకి నచ్చినపిల్లను తీసుకొచ్చి యీపిల్లని మెడకు కట్టుకుంటావా లేదాఅని కొడుకులను నిర్బంధపెట్టే తలిదండ్రులు చాలామంది వున్నారు లోకంలో. ఒకవేళ ఆపమృగం వాడికి వచ్చిందనుకో—తలిదండ్రులు బలవంతపెడుతున్నారనుకో, అప్పుడు వాడేం చెయ్యాలని నీఉద్దేశ్యం? తనకిష్టంలేని పిల్లనే చేసుకుని నా కర్మఅని తనకుతానే బుద్ధిచెప్పుకుంటూ యేదో విధంగా సంసారాన్ని యీడుస్తూ వుండమంటావా?

విజ—అబ్బే—అలా యెందుకంటాను?

మోహ—మరేం చేస్తావు? నీ థియరీ (Theory) ప్రకారం యెదిరించ కూడదుగా?

విజ—రోజా! అటువంటిస్థితిలో యేం చెయ్యమంటావో నువ్వు చెప్పు.

సరో.—తనకిష్టంలేని పిల్లని చేసుకుని సుఖంగా గడపవలసిన తనజీవితాన్ని దుఃఖభాజనం చేసుకోవడం కంటే, నాకిష్టంలేదని స్పష్టంగా చెప్పడమే మంచిదని తోస్తుంది.

మోహ—తిరస్కరించినట్టుకాదూ—అలాఅంటే?

సరో—యేమైనాసరే- అలా చెప్పవలసిందనే నా అభిప్రాయం.

మోహ—ఏమోయి! నీవైపు బలం తగ్గిపోయింది. సరోజినికూడా నాఅభిప్రాయంతోనే యేకీభవించింది. యింకను వ్వే మిగిలావు.

విజ—ఏమో! యీవిషయంలో యింకాఆలోచిస్తేనే గాని చెప్పలేను. మావాళ్లకేమీ చెప్పడానికి తోచకేగా-కొట్టు మిట్టాడుతున్నది? అలాంటిది నీకుమాత్రం చులాగ్గా చెప్పగలనా? నువ్వు మీ అక్కకూతురుని చేసుకోవడంతోటే మాట్లాడ కూడకున్నారు-మీవాళ్లు. అందుచేత నీకు తెలియటంలేదు-ఆకష్టసుఖాలు.

మోహ—వాళ్లుమాత్రం సులాగ్గా వదలిపెట్టారనుకున్నావా? అసలు చిన్నప్పటినుంచి నాకే యిస్తామంటూ వుండేవారు. కాని నేను వినిపించుకునే వాణ్ని గాను. మాటన్నంతమాత్రాన్ని అయిపోయిందా అనుకునేవాణ్ని. ఇలా అన్నట్టే అని యేడాదికిందట చేసుకుంటావా చస్తావా అని నాగొంతుక మీదొచ్చి కూచున్నారు. చివరకి మాఅమ్మకూడా మూడు వుపోషాలుచేసింది-ఆ పిల్లని చేసుకుంటే గాని వల్లగాదని. కాని నేను దానికీ లొంగలేదు. "లంకణం పరమౌషధమ్" అన్నారుగదా-ఇంతలోకే యేం మునిగిపోతుందని మాట్లాడ కూరుకున్నాను. ఇలాంటి బెదిరింపులకు జడిసి మెత్తబడితే అటుపైన అనుభవించే వాళ్లె

పరు-నేనా వాళ్లా? ఇటువంటి విషయాల్లోకూడా మొగమాటపడితే ప్రపంచంలో మన-మింకేం చెయ్యగలం?

ఇలా మోహనుడు లెక్చర్ (Lecture) యిస్తున్నాడు. సరోజిని మోహనునివంకే చూస్తూన్నది. మెడ ఒకప్రక్కకు ఒరిగివుంది. లోలకులు వెన్నెట్లో తళతళ మెరుస్తూన్నాయి. కుడిచేతివేలినున్న వజ్రపుటుంగరాన్ని యెడంచేతి వేళ్లతో కదుపుతూంది. మెల్లమెల్లగా వీస్తూన్నగాలి సరోజిని ముంగురులను ఇటూ అటూ చెదరగొట్టుతూన్నది. చంద్రకిరణాలు ప్రసరించుటవల్ల ఆమె పచ్చని ముఖానికి ఒక నూతన వికాసం కలుగుతున్నది. "చందురుడా మొగంబునకు చాకిరి చేయుటకైన సరిపోడే" అన్నట్లున్నది సరోజిని ముఖము. అప్పుడప్పుడు రెప్పలు వాల్చుచున్నా దృష్టి ఆతని పైనే వున్నది. మోహను డింత గొడవలో వున్నా, చూచీచూడనట్టు, సరోజిని వైఖరిని కనిపెట్టుతూనే వున్నాడు. విజయుడుమాత్రం ఆలోచనలోపడి మతిలేనివాడులాగు కూర్చున్నాడు. కాని యూహంగ లేమీ కనిపెట్టడంలేదు.

మోహ—ఏమోయి! నేనిలావాగుతూనే వున్నాను. నువ్వేదో ఆలోచనలో వున్నట్లున్నావే?

విజ—లేదు వింటూనే వున్నాను.

సరో—పది దాటిపోయినట్లుంది, యింక లేదాం విజయా!

విజ—అప్పుడే పదిదాటిందా?

మోహ—ఎంత అయిందో యెలా తెలుస్తుంది నీకు—భావతరంగాల్లో కొట్టుకుపోతున్న వాడికి?

విజ—నిజంగా అంతటైము (Time) అయిందని నే ననుకోలేదు సుమా!

సరో—విజయా! యేదో ఒకటి చెప్పొచ్చును గాని అకేవనిగా ఆలోచించి మనస్సు పాడుచేసుకోకు. అతిఆలోచన అయితే నిద్రపట్టదు. నిద్ర లేకపోతే హెల్తు (Health) చెడిపోతుంది. (అంటూ దాదా మెట్లుదిగడం ప్రారంభించింది.)

విజయ, మోహ—(మెట్లుదిగి యెవరిగదిలోకివారు వెళ్లిపోయి వారు.)

సరోజినిగదిలో రెండుమంచాలున్నాయి. సరోజిని వెళ్ళేసరికి యిందిర ఒక మంచంమీద పడుకుని నిద్రపోతున్నది. చప్పుడు చెయ్యకుండా తలుపువేసి రెండోమంచంమీదికి వెళ్లి పడుకుంది సరోజిని.

౪

సంధ్యాసమయము. సూర్యుడు మెల్లమెల్లగా అంతర్హితుడవుతున్నాడు. ఆకాశమంతయు సంజ కెంజాయలో అలుముకుపోయి 'కెంపులో నల్లన మాడు నాకసము' అన్నట్లున్నది. చిన్న చిన్న మేఘాలు నెమ్మదిగా పచారుచేస్తున్నాయి. పక్షులు కోలాహలంచేస్తూ పరుగులెత్తుతున్నాయి. తెరచాపలెత్తిన పడవలు గోదావరిమీద వయ్యారంగా పరుగెత్తుతున్నాయి. పల్లెవాళ్ల పిల్లలు కొంతమంది ఉత్సాహముగా గంతులువేస్తూ వొడ్డున ఆడుకుంటున్నారు. చల్లగాలికి షికారువచ్చిన యువతీయువకులు ఖులాసాగా మాట్లాడుకుంటూ యిసుకతిన్నెలమీద అక్కడక్కడ కూర్చున్నారు. ఈ ప్రదేశానికి కొంచెం దూరములో యెత్తుగానున్న యిసుకతిన్నెమీద సరోజినీ విజయుడు ఇద్దరూ కూర్చున్నారు. సరోజిని మాత్రం అతిమనోహరంగావున్న గోదావరివైపు రెప్పవాల్చకుండా చూస్తూవుంది. విజయుని ముఖము మబ్బుమాటునవున్న సూర్యబింబమువలె తేజోవిహీనంగావుంది. చికాకుపడిన మనస్సుతో చిన్నబోయిన ముఖంతో కూర్చున్నాడు—ఆకాశంవంక చూస్తూను. ఇలా మౌనంగానే పది పదిహేను నిముషాలు గడిచినతర్వాత విజయునికేసి చూచింది—సరోజిని.

సరో—అలాకూర్చున్నావేం విజయా?

విజ—నువ్వేదో చూస్తూ ఆనందిస్తున్నావు గదా అని నీ ఆనందాన్ని చెడగొట్టడం యిష్టంలేక పలకరించకుండా కూచున్నాను.

## సుందరకాండకథ

శ్లో. తతో గృధ్రస్య వచనా త్సమ్పాతే ర్హనుమాన్ బలీ,
శతయోజనవి స్తీర్ణం పుప్లువే లవణార్ణవమ్.

తత్ర లఙ్కాం సమాసాద్య పురీం రావణపాలితామ్,
దదర్శసీతాం ధ్యాయ న్తీ మశోకవనికాం గతామ్.

నివేదయిత్వాఽభిజ్ఞానం ప్రవృత్తించ నివేద్యచ,
సమాశ్వాస్యచ వైదేహీం మర్దయామాస తోరణమ్.

పఞ్చసేనాగ్రగాన్ హత్వా సప్తమ న్త్రిసుతా నపి,
శూర మక్షఞ్చ నిష్పిష్య గ్రహణం సముపాగమత్.

అస్త్రేణోన్ముక్త మాత్మానం జ్ఞాత్వాపైతామహాద్వరాత్,
మర్షయన్ రాక్షసాన్ వీరో య న్త్రిణస్తాన్ యదృచ్ఛయా.

తతో దగ్ధ్వాపురీం లఙ్కామృతేసీతాంచ మైథిలీమ్,
రామాయ ప్రియ మాఖ్యాతుం పున రాయా న్మహాకపిః.

సోఽభిగమ్య మహాత్మానం కృత్వారామం ప్రదక్షిణమ్,
న్యవేదయ దమే యాత్మా దృష్టా సీతేతి తత్త్వతః.

— బాలరామాయణమ్.

సరో—మోహనుడుంటే యీపాటికి కేవో కబుర్లు చెప్పి నవ్విస్తూవుండేవాడు.

విజ—సరిగా మనం బయలుదేరే టైము (Time)కే వచ్చాడాబంధువుడు. లేకపోతే మనతో' వచ్చేవాడే.

సరో—ఆయననుకూడా తీసుకొస్తే బాగుండేది.

విజ—యేడుగంటలబండీలో ఆయన వెళ్లిపోతుంటేనే!

సరో—అలాగా! నాకు తెలియదు............ అవును గాని—విజయా! ఈపిల్లలు ఆడుకోవడం చూస్తే మన చిన్నతనం జ్ఞాపకమొస్తున్నది సుమా.

విజ—నీ కింకా జ్ఞాపకముందా—మన చిన్నతనం?

సరో—అయ్యో! లేకేం? అటువంటి రోజులు మళ్లీ యెలావస్తాయి మన జీవితంలో?

విజ—యెవరైనా బాల్యావస్థలోనే సౌఖ్యపడతారు. పెద్దయినతర్వాత యెంతటివాళ్లయినా యేదో ఒకవిధమైన బాధపడుతూనే వుంటారు.

సరో—యెలాగైనా చిన్నప్పటి సౌఖ్యం రాదనుకో—కాని, నే నిప్పుడైనా యేమీ అంత బాధపడటం లేదే?

విజ—అయితే నువ్వింకా చిన్నదానవన్నమాటే.

సరో—నేను చిన్నదాన్నేమిటి? నాకిప్పుడు పదిహేడవయేడు జరుగుతున్నది.

విజ—అయితేమాత్రం నీకు చిన్నతనంకాదా?

సరో—పోనీ-అలానే ఒప్పుకుంటానుగాని, నాకంటె పెద్దవాడవుకాదూ—నువ్వేం బాధపడుతున్నావో చెప్పు.

విజ—కొంత చెప్పుకుంటే తీరుతుందిట. నీతో చెప్పడానికవకాశంలేక యిన్నిరోజులూరుకున్నాను.

సరో—అవకాశానికేముంది—విజయా! నే నెప్పుడు కనపడటంలేదు?

విజ—అదీగాక, అంత తొందరపడి చెప్పడానికిష్టంలేకకూడా కొంత నిదానించుకొచ్చాను.

సరో—అయినా యెన్నడూ నాదగ్గిర రహస్యం దాచేవాడవుకావే! నాకు తెలియచెయ్యాలనుకుంటూ యెందుకాలస్యం చేశావు?

విజ—నీతో చెపితే ప్రయోజనంవుందనే అనుకుంటున్నాను. యెలా జరగవలసుందో!

సరో—విజయా! నీ మాటలతీరు కొత్తగావుంది. చివరకది నాకసాధ్యంకాదు గదా?

విజ—నీకుతప్ప యెవరికీ సాధ్యంకాదు-రోజా!

సరో—అయితే నువ్వింత విచారపడటమెందుకు? మనమిద్దర మొకవూళ్లో పెరిగి చిన్నప్పటినుంచీ స్నేహంగావుంటూ నీకేదో ఆపదవచ్చినప్పుడు నే నష్టపడకపోతే మనదిక స్నేహమనిపించుకుంటుందా?

విజ—నన్ను నువ్వు తేలుస్తావన్న ధైర్యంవుంది. అందుచేతనే అడగటానికి సాహసిస్తున్నాను.

సరో—సంగతేమిటో చెప్పడానికింత ఆలస్యం చేస్తున్నావేమిటి? ఆరుదాటిపోతూంది-ఎప్పుడు మనం తిరిగి వెళ్లటం?

విజ—పోనీ-రోజా! నీ కంత విసుగుదలగావుంటే నిన్ను బాధపెట్ట దలుచుకోలేను. ఇక వెళ్దాంలే.

సరో—నాకేమీ విసుగుదలలేదు—విజయా! సంగతేమిటో తొందరగా తెలుసుకుందామనే ఆతురతతో అలా అన్నాను. దానికంత కోపమొస్తుందని అనుకోలేదు.

విజ—నాఅంత దురదృష్టవంతుడికి కోపంకూడానా-రోజా?

సరో—అలా అనుకోవలసినంత అవసరమేమొచ్చింది నీకు?

విజ—అదృష్టమో, దురదృష్టమో, నాకేం పట్టదలచుకుందో యిప్పుడే తేలిపోతుంది.

విజయు డిలా అంటూంటే సరోజని తెల్లపోయి

కూర్చుంది. ఎందుచేత యిలా మాట్లాడుతున్నాడో ఆవిడ కర్థంకావడంలేదు. విజయుడొక్కసారి పెద్దనిట్టూర్పు విడిచి తలవంచుకుని నేలచూపులు చూస్తూ వూరుకున్నాడు. సరోజనికూడా నిర్జీవ ప్రతిమవలె కూర్చుండిపోయింది. ఇలా రెండు మూడు నిముషాలు గడచినతర్వాత తల పైకెత్తి—'రోజా'.........'నీకు'.........అన్నాడు.

సరో—ఏమిటి—విజయా! 'నీకు' అని ఆగిపోయావేం?

విజ—నామీద..............ప్రేమవుందా—నీకు? (అన్నాడు—దీనంగా చూస్తూ).

దీనికేమి జవాబువస్తుందో అని విజయుని గుండెలు తటతట కొట్టుకుంటున్నాయి.

సరో—లేకేం?

ఈ జవాబు వినేసరికి ప్రాణంచేరుకుంది—విజయుడికి.

విజ—(కొంచెం ధైర్యంతెచ్చుకుని) అయితే నీవు నన్ను ప్రేమిస్తున్నావా?

ఈమాట విజయుడనేసరికి సరోజని చెవులకు 'ప్రేమిస్తున్నావా' అనే వాక్యం వెగటుగా తోచినట్టయింది—యెందుచేతనో.

సరో—కొత్తపద్ధతిగా వున్నాయేమిటి-విజయా—నీమాటలు?.........నీమీద నాకు ప్రేమవుంది-లేకేం!

విజ—నాకే అప్పుడప్పుడు సందేహం కలుగుతూ వుండేది. ఈక్షణంతో నా సందేహం నివారణ అయింది. ఇక నే నదృష్టవంతుణ్ణికాకేం—నీవు నాపాలిటి భాగ్యదేవతవైనప్పుడు? చిన్నప్పటి నుంచి నీవే నా ప్రణయస్వరూపిణివని అనుకుంటూ వుండేవాణ్ని. కాని నా అభిప్రాయ మెప్పుడూ నీకు తెలియనివ్వలేదు—రోజా! నా మీద నీకు సంపూర్ణమైన దయవుందని యిప్పటికి తెలుసుకోగలిగాను. ఏకారణంచేతనైనా నా ప్రాణం అకస్మాత్తుగాపోయినా యిక నాకు విచారంలేదు.

విజయుని వాగ్ధోరణి వినేసరికి సరోజని ముఖం రౌద్రంగా జేవురించింది. కనుబొమ్మలు రెండూ ముడి పడ్డాయి. పైటమీదనున్న గొలుసుకూడ గుండెలతో బాటు కొట్టుకుంటూంది.

సరో—(గంభీరముగా) నీమాటలింత అసందర్భంగా వున్నాయేం—విజయా?

విజ—(తెల్లపోయి) నామాటల్లో అసందర్భ మేముంది—రోజా?

సరో—అసందర్భమేముందా! ఒక సోదరుడు మాట్లాడినట్టేవుందా—నీ ధోరణి?

విజ—(ఆశ్చర్యముగా) సోదరుడేమిటి?

సరో—నీకుమాత్రం తెలియదూ? నేను మొదటి నుంచి నిన్ను సోదరునిలాగే ప్రేమిస్తున్నాను. ఏకారణంచేతనో కొద్దిరోజులకు నీ మనస్సు మారిపోయింది కాబోలు. అందుచేత యిలా మాట్లాడుతున్నావు. ఇంత చపలతున్నవాడ వెందుకైనా పనికొస్తావా—ప్రపంచంలో?

విజ—రామరామ! మొదట సోదరినివలె ప్రేమిస్తూ ఆతర్వాత చాపల్యంచేత మనస్సు మారిపోయేటంత బుద్ధిహీనుణ్నిగాను రోజా!

ఇలా అంటూవుండగా విజయుడికండ్లలోనుంచి రెండుమూడు నీటిబిందువులు జారిపడ్డాయి. స్త్రీ హృదయం కరగడానికెంతో సేపుపట్టుతుందా! విజయునికన్నీళ్లు చూచేసరికి సరోజని మనస్సు నీరైపోయింది.

సరో—విజయా! నీవు బుద్ధిపూర్వకంగానే, నీమనస్సు మార్చుకున్నావనుకుని నిన్ను నొప్పించే మాటలన్నాను-నీసంగతి సరీగా తెలుసుకోలేక. నీతో యెన్నడైనా కఠినంగా మాట్లాడానా? నేను చిన్నప్పటినుంచి నిన్ను సోదరభావంతో ప్రేమిస్తున్నాను. నీవుకూడా అల్లాగే ప్రేమిస్తూన్నావనుకున్నాను. ఇంతకూ ఒకరి అభిప్రాయం ఒకరు తెలుసుకోలేకపోయాం. అందువల్లొచ్చిందీ ప్రమాదం.

సరోజిని చెప్పేమాటలు వింటూ నిర్ఘాంతపోయి కూర్చున్నాడు—విజయుడు. కంటినీరుమాత్రం కట్టు పడలేదు. ఇలా నాలుగైదు నిముషాలు గడిచాయి.

విజ—రోజా! నా కీజన్మలో యిక సౌఖ్యంలేదు. నువ్విల్లాచెప్పుతావని నే నెన్నడు అనుకోలేదు. నాదురదృష్టాని కెవరేం చేస్తారు...పోనీ—నిన్ను వివాహంచేసుకునే అదృష్టవంతు డెవరో చెప్పగలవా?

సరో—నాకింతట్లో వివాహం చేసుకోవాలని లేదు—విజయా!

విజ—ఎప్పుడు చేసుకున్నాసరే. నీవు ప్రేమించే ధన్యు డెవరై యుంటారో తెలుసుకోవాలనుంది—రోజా—నాకు.

సరో—నేను మనస్ఫూర్తిగా మోహనున్నే ప్రేమిస్తున్నాను.

విజ—ఆ! యేమిటీ! మోహనున్నా?

(అని ఆశ్చర్యంగా చూచాడు.)

సరో—అవును-విజయా! నేనతన్నే వివాహం చేసుకుంటాను. అయిందేదో అయింది. నీకు నచ్చిన కన్య నెవరినైనా వివాహంచేసుకుని సుఖించు. అంతేగాని, మనస్సు చెడగొట్టుకుంటే యేం ప్రయోజనముంది?

విజ—రోజా! ఇంకా నాకు వివాహ మేమిటి? నా హృదయపూర్వకంగా నిన్నే ప్రేమించాను. నా హృదయమంతను నీమూర్తే ఆవరించుకుంది. ఇంకొక యువతికి తావులేదు. ఇక నెవరిని ప్రేమించడానికి నామనసొప్పదు.

సరో—మరేంచేస్తావు? నన్నుకోరడం నీకు న్యాయమేనా—విజయా?

విజ—నిన్ను ప్రేమించి యింకొకరిని చేసుకోవడం మాత్రం ధర్మమని తోస్తూందా నీకు? ఇక నా ప్రాణంతో నేను వివాహంచేసుకోను. నాజీవితమిలా వ్యర్థం కావలసిందే...కాని నాతుది కోరికొక్కటుంది. అదిమాత్రం నెరవేరిస్తే చాలును. దాని నాధారం చేసుకుని ప్రాణం నిలబెట్టుకుంటాను—రోజా!

సరోజినికూడా ఆపుకోలేకుండా వుంది—దుఃఖం. కళ్లనీళ్ళు బొటబొట కారుతున్నాయి.

సరో—నువ్విలా అంటూంటే నాహృదయం పగిలిపోతూంది—విజయా!......అయినా యేమిటి నీ కోరిక?

విజ—ఈదీన దశావసానకాలంలో కోరుతున్న కోరిక. ఇక నేనేం చెప్పగలను? నీదయ; నన్ను క్షమిస్తానంటే చెపుతాను.

సరోజిని తలవంచి మౌనంగా వూరుకుంది. విజయుడికి కళ్లనీళ్ళు తిరుగుతూనే వున్నాయి. కళ్ళుమాత్రం తేజోవిహీనంగా వున్నాయి. యెలావున్నా విజయుని ముఖం అందంగానే వుంది. సరోజిని గెడ్డమును పట్టుకుని పైకెత్తాడు. సరోజినిముఖము, చూచిన కొద్దీ ముగ్ధుణ్ని చేసేస్తూంది విజయుణ్ని. విజయుడి ముఖం నెమ్మదిగా ముందుకు రావడం ప్రారంభించింది.

సరో—(అదిరిపడి వెనుకకుజరిగి) నీకూ నాకూ యెంత దూరముందో యెరుగుదువా—విజయా? ఇంత అధర్మానికి పాల్పడొచ్చా?

ఇలా అనేసరికి విజయుడి ముఖం వెలవెలబోయింది. పెదవులు పొడారుకు పోతున్నాయి.

విజ—రోజా! ఇదికూడా అధర్మమేనా? నేనిదొక్కటే నిన్ను కోరింది. చివరకి నాకిది లభించలేదు. నాఅదృష్టానికి నువ్వేం చెయ్యగలవు? నాతుది సంభాషణ యిదేనేమో? మళ్ళీ నిన్ను చూచేభాగ్యం కలుగుతుందో...రోజా! నీచెయ్యేదీ?

సరోజిని మెల్లిగా చెయ్యి చాపింది. ఆచేతిని తన చేతితో పట్టుకున్నాడు-విజయుడు. సరోజిని చేతిమీద కన్నీటిచుక్కలు పడుతూనే వున్నాయి. ఇలా అయిదారు నిముషాలవరకు సరోజినిచెయ్యి విజయుని చేతిలోనే వుంది. మెల్లిమెల్లిగా విజయుని పెదవుల

దగ్గిరికి వెళుతూంటా చెయ్యి-సరోజని ఆ కనిచీకటిలో కళ్లెత్తిచూచింది. గాని మౌనంగానే వూరుకుంది. తన పెదవులదగ్గిరికి తీసుకెళుతూన్న చేతిని కొంచెం సేపు మధ్యలో ఆపేశాడు-విజయుడు. అలా ఆపి యెందువల్లనో గాని నెమ్మదిగా జారవిడిచాడు. సరోజిని పంచివతల యెత్తసంగానే కూర్చుంది. కన్నీళ్లతో వక్షస్థలమంతా తడిసిపోతూంది. మరిలేనిదాని వలె కూర్చుండి పోయింది. ఇలా యెంతసేపు కూర్చుందో ఆవిడకు తెలియదు. "సరోజనీ! చీకట్లో ఒక్కదానవు కూర్చున్నావేం" అన్నారు యెవరో! తుల్లిపడి తలయెత్తిచూచింది. "ఇదేమిటి? విజయుడేడీ-మోహనా!" అంది--కళ్ల నీళ్లు తుడుచుకుంటూ.

మోహ—నీతో వచ్చాడుగాదూ?

సరో—అయ్యో! నాపక్కనే కూర్చున్నాడు-ఇంతట్లో యేమైపోయాడు!

మోహ—ఆహాఁ! ఎక్కడికి వెళతాడు? నిన్నాడించడానికెక్కడైనా దాక్కున్నాడేమో?

సరో—అక్కడ లేదు! ఎక్కడికో వెళ్లిపోయాడు (అన్నది-గద్గదస్వరముతో.)

మోహ—అదేమిటి? అలా యేడుస్తున్నావు! ఏం జరిగింది-సరోజినీ?

సరో—ఎక్కడి కెళ్లాడో ముందుచూడు! ఇంకా నుంచుంటావేం? (అన్నది ఆందోళనతో.)

ఇద్దరూ ఖంగారుపడుతూ నాలుగువైపులకూ వెళ్లిచూచారు. కాని గాఢాంధకారం. కారుమబ్బులు కమ్ముకొస్తున్నాయి. అలాంటి చీకట్లోనే, చాలా సేపటివరకు యెక్కడైనా కనిపిస్తాడేమోనని వెతికారు-యిద్దరూను. కాని, యేడీ?...విజయుడు కనపడందే...ఏమైపోయాడో!!!...



## మా తల్లీ! చదువుకోవూ?

బోయి భీమన్న గారు

చదువుకోవమ్మ! మాయమ్మ! చదువుకొమ్మ!
విద్య లేకుండ నల్లరిపిల్లవగుచు
నెంతకాలము తిరిగెద వింతదాన
వైన పసిబాలవేస? మాయమ్మకాన!.
చిఱుముసాటల ప్రొద్దులు గడుపనేల,
మంచివౌ క్రొత్తబట్టలు మాసిపోవ?
తీరికయులేదు వేళకాహారమునకు
ఏమియాటలుపాటలు? ఏమిటమ్మ!
సాటివారలు మంచివస్త్రముల దాల్చి
తలలదువ్వి మెడల పూవుదండలుంచి
చలిదిభుజియించి వెస పాఠశాలకేగు
చున్నవారలు,మాతల్లి చూడుమదిగో!

ఆటలాడవచ్చు, పాటలుపాడఁగ
వచ్చు, బొమ్మలల్లవచ్చు, విద్య
నేర్వవచ్చు,గాన నీవిప్పుడ బడికి
పోవుమమ్మ పలక పొత్తములతో.
బడికిఁబోయిన నిను మంచి బాలవనుచు
ఎల్లవారలు పొగడుదు రెంతయేని
పూవులు, మిఠాయి, పుస్తకంబులును దెచ్చి
యిచ్చుమీయయ్య పలుమారుమెచ్చుకొంచు.
భావిభారతమాత సౌభాగ్యమెల్ల
నీవదనకాంతులనకాదె నిలచియుండు!
లలితవిద్యాప్రవీణవై వెలయుమమ్మ
పావనీ! ఆంధ్రభూమి సంపదలగూర్చి.

# 'మాయములికి'

తుమ్మలపల్లి వేంకటరత్నము పంతులుగారు

......బ్రహ్మాండభవనమెల్ల
ఘోరకాకోలకాలాంధకారపటలి
పాలుకావించినదియో ప్రభాకరుండు.
ఉరవణించు మరుత్ప్రవాహోర్మివితతి
కాగలేకెట్టులో యీడులాడుచుండె
బారలనుచాచి యొకమేఘపూరుషుండు.
ఇంతలోఁ గానరానిదొంగెవఁడో? వచ్చి
మొనసి మాయింటి దీపంపుమొగ్గ గిల్లె.
అంతనాత్మీయనేత్రవై యర్థ్యభంగి

౧

నరయునాయెట్టయెదుటనే మెఱపుమెఱయు
సరణి మత్పితృదేవు వక్షస్థలమున
వ్రాలె; నెక్కడిదో యొకవాలుఁదూఁపు.
పిడుగుతునుకయువలె, మీఁదఁబడి, క్షణాన
మాయమైపోయెనంత నమ్మాయములికి.
శూన్యపంజరమొక్కటే చూడనయ్యె
పంజరఁపుఁబావురా యెటో పాఱిపోయె
పంజరములోనిపావురాపైని వాలు
రమ్ము పఱపిన పరమకిరాతుఁ డెవఁడో?

౨

అరయుపూన్కితోడ దెసలారయు నావలె నీవుగూడ ని
ట్లారనిదుఃఖయుక్తిఁ గనుపంతయుఁ జెర్వగఁ జేసికొంచు న
వార్వగ బాష్పతోయకణవర్షము నేలకు నింగి కొక్కటే
ధారగఁ గారగా, నెద యదాయదలై, విలపించెదేలొకో?

౩

నావలెఁదండ్రిఁగోల్పడిన నావవుకావుగదోయి! మేఘుఁడా!
నావలె, శోకవారినిధి నావవలెన్ జలియించుచుంటి, వ
ప్పావనుఁడైన సూర్యభగవానుఁడు నీ జనకుండు కావలెన్
కావుననాతఁ డస్తగతిగాంచిన దానవిచారమందెదో?

జాలింబొందగనేల? నీజనకుఁ డస్తంగామియైయెనంత; నీ
వేళన్ గ్రుంగిన నీదుతండ్రి యిఁక రేపే లేచివచ్చున్, భువిన్
నీలే కన్పడమిన్ మదీయజనకున్ వీక్షింపగా, జన్మజ
న్మాలన్; మిన్నులుప్రాకె నాదు హృదయాంతర్ధూమమోనిచ్చటల్.

నేను, గంభీరకాసారలూనితాబ్జషండమండనభృద్గజేంద్రుండ; నాదు
దంతలగ్నసుగంధిలతాంతక్లుప్తితోడి నాచిన్నితొండ మెత్తుమను; నీకు
సేపదమ్మందదేమో? యని విలపింతు.

# లైలీ

పి. అప్పల నరసింహంగారు బి; ఎ.

లైలీ ఉన్నతపర్వతపంక్తులనుండి జారు జలప్రపాతమును తదేకదృష్టితో గాంచుచుండెను. వేఱొకచో కలకలరవముతో ప్రవాహకెరటములు రాతిగుట్టలను ముద్దుపెట్టుకొనుచుండెను. అది రమ్యమగు యేకాంతస్థలము. ఆ మనోహరదృశ్యముల గాంచుచు లైలీ నిలువబడిపోయినది. ఇంతలో నెవరో వెనుకనుండివచ్చి కనులుమూసిరి. చకితయై లైలీ 'యెవరు' అన్నది. కాని జవాబులేదు. తన రెండు చేతులతో వా రెండు చేతులను తాకినదేగాని గుర్తెరుగలేకపోయినది.

'నన్ను విడువుడు'

'లేనిచో'

'గట్టిగా కేకిడి నిన్ను పట్టింతును'

'నీ మృదుస్వరమాత్రే దూరము వినబడదులే' అని పక్కున యా యాగంతకుడు నవ్వెను.

మెల్లగా చేతులువీడినవి. 'మనోహరా' యని లైలీ నివ్వెఱపడినది. అంత వా రిట్లు సంభాషించిరి.

'మనోహరా, నా జాడెట్లు కనుగొంటివి?'

'ప్రాతఃకాలమునుండి నీకై వెదకుచున్నాను, నీవు చాల నిర్దయురాలవు'

'కొండపై కెక్కుదమా?'

'పద'

మనోహరుడు లైలీ మృదుహస్తముల బట్టికొని పైకి జనుచుండెను. మంచుకొండనుండి లైలీ పాదము లప్పుడప్పుడు జాఱుచుండెను.

'లైలీ, ఇక మన మింటికేగుదమా?'

'వలదు. ఈ చల్లగాలి కీట కొంతతడవు విహరింతము.'

కొండపై అన్నపూర్ణ దేవాలయ ముండెను. యిద్దఱును దేవాలయముపైపు పోవుచుండిరి. గుడికి నలువైపులను పూలవనముండెను.

'లైలీ, ఎవరు ముందుగ గుడికేరుదురో, పందెము' మనోహరుడు ముందుపోయి గుడిచేరెను. లైలీకై నిరీక్షించుచుండెను. ఎన్నియోగంటలు గడచినవి. కాని లైలీ రాలేదు. వనమంతయు లైలీకై మనోహరుడు గాలించి వెదకెను. 'కాలుజారి క్రిందపడిపోలేదు గదా. అట్లే జరిగిన.........!' మనోహరుని నేత్రములనుండి యశ్రువులు జలజల రాలెను. అన్నపూర్ణవిగ్రహము తన్నుజూచి నవ్వుచున్నట్లు మనోహరునకు కన్పట్టెను. అంత మనోహరుడు 'దేవీ! ఇదియేనా, నీవాత్సల్యము! నేమిరువురము నిన్ను పూజించుటకై కదా వచ్చితిమి. మమ్ముల వేఱుచేసి నవ్వుచుంటివా?' యింకనూ ప్రతిమ నవ్వుచునే యుండెను.

క్రోధితుడై ప్రతిమను ఖండించుటకు ముందుకు సాగెను. ఇంతలో యెచటనుండియో లైలీ వచ్చి కన్నుల యెదుట పడెను.

లైలీ చిరునవ్వులో మనోహరుని క్రోధశోకములు లీనమైపోయినవి. మనోహరుడు

'లైలీ, యెచటకు బోయితివి?'

'ఈ ద్యానవనమున పూల నేఱుటకు'

ఇరువురు యింటివైపు మఱలిరి.

'లైలీ, రామాయణ మెన్నడైన చదివియుంటివా?'

'ఎన్నోమారులు'

'కథ యేమైన జ్ఞాపకమున్నదా?'

'బాగుగా'

'సరియే కాని నీచేతిపూలమాలచే నెవరి కంఠము నలంకరింప జూచుచున్నావు?'

లైలీ కన్నులించుక మూతపడినవి. తన పొరపాటు గ్రహించినది.

౨

సేను గారు సంపన్నగృహస్థుడు. గవర్నమెంటుద్యోగి. టెన్నిస ఆటలో ప్రవీణుడు! గవర్న

మెంటువారు వీరి యోగ్యతగాంచి వీరికి సర్ బిరుద మొసంగిరి. లక్ష్మీసరస్వతు లా మహాశయునింట నైకమత్యమున వసించుచుండిరి. వీరి కుమార్తెయే లైలీ. లైలీ సేనుగారి యేకపుత్రిక. ఆమెయెడ గారాబము మెండు. ఆమె మగపిల్లలబడిలో చదువుకొనుచుండెను. సంఘాచారములను వ్యర్థ ఆడంబరములుగా తలచుచుండెడిది. ఆమె ఉన్నత విద్యకై లండను నగరమునకు వెళ్లినది. ఆ సంవత్సరమే మనోహరుడు పి.హెచ్.డి. పరీక్ష నిచ్చి వచ్చెను. పర్వతప్రదేశమున వారు కలిసికొని పదేండ్లయినది. కాని వారద్దానిని మరువలేదు, సేనుగారు వారి ప్రేమను గాంచి కన్నులపండువుజేసికొనుచుండిరి.

## 3

లైలీ లండనుపోయి మూడేండ్లయినది. అకస్మాత్తుగా ఒకదినమున గదిలో నొకలేఖ గాంచినది. అది విప్పిజూడ నందిట్లున్నది.

"ప్రియమైన లైలీ,

హిందూ-ముసల్మానుల కలహములలో పాల్గొని కండ్లు పోగొట్టుకొంటిని. డాక్టరులు కొన్నిమాసములు చికిత్సచేసినపిమ్మట కండ్లు వచ్చుట దుర్లభమని చెప్పినారు.

లైలీ, నీయాశలు నిరాశలైనవి. ఇక నీదురదృష్టవంతుని రూపము నీ హృదయఫలకమునుండి చెరిపివేయుము. ఆహా! భగవానుడు నా సుఖనిద్రను భంగము కలిగించినాడు. నే నిపుడు నిర్జనప్రపంచమందు నిల్చునియున్నాను. లైలీ......ప్రియలైలీ, నీవు నాదానవయ్యు నాదానవు కాలేకపోతివి. నా ప్రేమ పూర్తియయినది. నీవు న స్నేహ ప్రేమబంధములచే గట్టివైచితివో వాటిని నీకొరకు తెంపివేయుచున్నాను. విచారమించుకేనిలేక వెంటనే వేఱొకని ప్రేమింతువని నమ్ముచున్నాను.

నిజముగా నీ వదృష్టవంతురాలవే. వివాహమైన తర్వాత నిట్టి దుస్థితి సంభవించిన.........లైలీ ఏమి చెప్పుదును. నన్ను మఱచిపో. నన్ను నీ మనఃఫలకము నుండి తొలగింపుము. కాని నేనట్లు సేయజాలను. ఏలనగ, దృష్టిద్వారము మూయబడుటవలన పూర్వమే నీ మోహనమూర్తి హృదయమందిరమున స్థాపించితిని. దాని నావలకు బోనిచ్చుటకు మార్గములేదు.

అంధుడు

మనోహరుడు."

లైలీ లేఖను పూర్తిచేసి నిశ్చేష్టురాలయ్యెను. విచారముపట్టలేక 'ఆహా, మనోహరా, నా హృదయస్వామీ, నా సుఖస్థానమా! ఆహా! ఏవస్తువు నే ప్రాణముకన్న నెక్కుడుగా ప్రేమించుచుంటినో దానిని పోగొట్టుకొంటిని. ఇక నాజీవనము వృథా గదా. ఉన్నూ!' అని విలపింపసాగెను.

## 4

మఱుచటిదినమున మనోహరుని వార్త సేను దంపతులకు దెలిసెను. నాలుగైదు మాసములు గడచెను. కాని మనోహరు డెవ్వరికి కాన్పించుటలేదు. ఇందేదియో మోసమున్నదని సేనుగారు తలచిరి.

'ఇపుడు నీవు మనోహరుని వివాహమాడుట నాకసమ్మతము. వానిపైనున్న ప్రేమను తొలగించుకొను'మని యొకలేఖ కుమార్తెపేర వ్రాసిరి.

లైలీ లేఖ నందికొన్నది, చదివిన కొలదీ యొడలు కంపించెను. 'ఆహా, మమతాహీనమన్న హృదయజననీ, ఇంత నిర్దయా! ఇంత స్వార్థమా, నీ వెప్పుడు నూ నిజమైన ప్రేమపాశము చదివియుండలేదా? దాని త్యాగము, మహత్వము తెలిసికొనలేదా? మనోహరుని వివాహమాడుటే నా నిశ్చయము. నా ప్రతిజ్ఞ నెఱవేర్చుకొనుటకు నా కింకనూ శక్తి కలదు. ఈ ప్రపంచముతో నాకేమియూ పనిలేదు. నా ధర్మమును నేను విడునను. అంధుడయిన మాత్రాన మనోహరుడు నా ప్రేమరాజ్యమునుండ నవర్హుడా? జననీ, క్షమించుము. నేను నీ యనుచితాజ్ఞను పాలింపజాలను. నేను నా ప్రియునికొరకు జీవములు సహితము అర్పింప'.........అని విలపించుచుండెను.

"ఎవరికోరకు మిస్ షైలీ' అని వినవచ్చెను.

షైలీ వెనుకకు తిరిగినది. ఎదుట తన సహాధ్యాయిని మేరీ. 'హల్లో మేరీ టేక్ యువర్ సీట్.'

'షైలీ, కుశలమా?'.

'ప్రమాదవిషయ మేదియు లేదు. ఈశ్వరుని లీలలనంతములు. నా జీవనమం దొక భయంకర పరివర్తనము రానున్నది.'

'రానున్నదా? వచ్చినదా?'

'రానున్నది.'

'అదేదియో నా కెరింగింపవా?'

'తప్పక చెప్పెదను.'

షైలీ మేరీమృదుహస్తములందు మనోహరుని లేఖ నుంచెను.

'నీ కాబోవు భర్తయా?'

'అవును.'

'అయినచో నీపైనుండి విపత్తు తొలగిపోయినది సుమా?'

'ఎట్లు.'

'ఒకవేళ వివాహమైయుండినచో నీ జీవిత మంధకారము గదా?'

'వివాహ మేల, మేరీ; ప్రణయతారలలో మా ఆత్మలు కలిసిపోయినవి. అవి యిపుడు విడిపోవుట అసాధ్యము.'.

'కాని, షైలీ, సమయానుకూలముగా బంధము త్రెంపవలసి వచ్చుచుండును. అయనే స్వయముగా త్రెంపుకొన్నాడు గదా.'

'మేరీ, భారతదేశపు స్త్రీలకును, యూరోపియన్ కన్యలకును తారతమ్య మిదియే సుమా. మేము మా ప్రియులను స్వచ్ఛమైన ప్రేమలో నోలలాడింతుము. మీప్రేమ స్వచ్ఛమైనది కాదు. నీ విట్టి స్థితియందున్నచో నేమి చేయుదువు!'

'మరియొకని వివాహమాడుదును.' -

'వివాహమైన తరువాత జరిగిన?'

'భర్తను వీడుదును.'

'సంభవమా'

'సంభవము కాకేమి?'

షైలీ పక్కున నవ్వెను. 'మీప్రేమ అభినయము మాత్రమే. మీ సంఘమందు స్వార్థపరత్వ మెక్కుడు. మీ హృదయము కేవలము సుఖైశ్వర్యభోగముల నాశించునది మాత్రమే. భారతదేశ మెట్టి దుర్గతి యందున్నను స్వార్థత్యాగమునకు వెనుదీయదు సుమా. భారతనారీమణులే ప్రేమయన నేమో యెరుగుదురు. అభినయముమాత్ర మెరుగుదురు మీ ఐరోపియను సుందరాంగులు. మృతుడైన పతివెంట చిచ్చునఁబడి మృతిజెందుటకుగూడ మా భారతనారీమణులు వెనుదీయరు.'

మేరీ లజ్జితరై 'నాహృదయము కంపించుచున్నది. అట్లైన ఆ గుడ్డిమగనినే వివాహమాడుదువా?'

'నిస్సందేహముగా'

మేరీ నేత్రములు ఆశ్చర్యముచే ప్రకాశవంతములయ్యెను. 'మేరీ, ఆదే మట్లు మాటాడుచుంటివి! ఆయనను సేవ యంధుని జేసినది. నన్ను ప్రేమ అంధురాలుగ జేయును. మేమిద్దఱము గ్రుడ్డివారమే కదా!'

'పిచ్చిదానవైపోతివా? షైలీ. నీ వాయంధునే పెండ్లాడుదువన్న మాట. నీ కేమి సుఖము లభించును.?'

'సుఖమనెడివస్తు వెట్టిది?. దానిని లోకు లెఱుగనే రెఱుగరు.'

'తెలిసినూతిలో దూకుట పిచ్చికాదా?'

'పిచ్చితనము స్వచ్ఛప్రేమకు సోపానము సుమీ'

'నీ నిశ్చయము స్థిరమా'

'కాకుండ నుండు టెట్లు?'

'మంచిది. నా దొకమాట కుత్తరమిమ్ము'

'ఏమది?'

'మనోహరునందువలెనే నీయం దేదేని దోషమున్నయెడల యాతఁడుకూడ నీయం దిట్టిప్రేమ జూపునా?'

'ఇంతకన్న యధికముగ జూపును. అతఁడు కేవలము అంధుఁడు. నేను ఒకవేళ మరణించినచో

ఆతఁ డెన్నడూ ద్వితీయవివాహము చేసికొనఁడు!'

'ఆశ్చర్యము'

'నేను భారతదేశపు సామాన్యస్త్రీనే సుమా. మా భారతనారీమణుల చరిత్రలు చదివినచో నీ వెంత యాశ్చర్యపడుదువో గదా.'

లైలీ తాను తన ప్రియునకు వ్రాసిన లేఖ జూపెను. అందిట్లున్నది:

'హృదయసామ్రాట్, మనోహరా, మీరు కరుణతో వ్రాసిన లేఖ నందికొంటిని. ఈ దుఃఖసమాచారము విని మిమ్ముల నోదార్చుట కెందఱో మిత్రులు వచ్చియుందురు. నా ప్రాణనాథుఁడు ధైర్యావతారమనియు, శాంతనిధియనియు గర్వపడుచున్నాను. శోకావేశముచే నాపై కొంత యత్యాచారము సలిపినారు. ఏల? నేను మిమ్ముల విడుతు ననియా? మీరు పండితులచే యగ్నిసాక్షిగా జరుపబడిన వివాహమునే వివాహముగా తలంచుచున్నారా? మన నిజవివాహము 10 సంవత్సరముల క్రిందట మంచుకొండపైనే జరిగిపోయినది. ఏశక్తియు మన వివాహబంధముల త్రెంపజాలదు సుమా.

మీ ప్రియురాలు,

లైలీ'

లేఖ సాంతముగ చదివి వినిపించినది. మేరీ ఆశ్చర్యములో మునిగిపోయి లైలీవైపు చూచుచుండెను. ఆమె ఆకృతి గంభీరముగనుండెను. నిశ్శబ్దముగా వెడలిపోయినది.

చదువు పూర్తియయినది. లైలీ బొంబాయి స్టేషనులో దిగినది. ఆమెకై యెవ్వరును రాలేదు. ఆమె తలిదండ్రులు మనోహరు నామె వివాహమాడుచో వారికిని ఆమెకును ఏవిధమైన సంబంధము ఉండదని యిదివఱకే యామెకు లేఖ వ్రాసిరి. లైలీ లండనునందున్నప్పుడే మనోహరుని జాబింకొకటి చేరెను. అందిట్లున్నది. 'అంధుఁడనగుటచే జాబు వ్రాయ నసమర్థుఁడను.' లైలీ హృదయము తీవ్ర వేదన నొందసాగెను. ఎన్నెన్నో యాశలతో యామె స్వదేశమునకు తిరిగివచ్చినది. ఇంతలో ఎవరో గట్టిగా 'మీరేనా లైలీగారు' అని కేక వేసిరి. అవునని చెప్పగానే యా యపరిచితవ్యక్తి జాబొకటి చేతి కిచ్చి మాయమయ్యెను. అది మనోహరుని జాబు. అందిట్లున్నది.

'నీ తలిదండ్రులు నాయందు కోపముతో నున్నారు...............హోటలులో స్వాగతమిచ్చుటకై వేచియుందును. నాయందు ప్రేమయున్న నొక్కసారి కలిసికొమ్ము!'

లైలీ మోటారునెక్కి చరచర హోటలువైపు పోయెను. ఆమె హృదయ మానందము పట్టజాలకుండెను. మిత్రులతో మనోహరుఁడు స్వాగతమిచ్చుటకై గుమ్మముకడ నిల్చుండెను.

చూడగనే లైలీ మోము వికసించెను. మనోహరుఁడేని సహాయము లేకుండగనే ముందునకు నడిచి వచ్చెను. సాయంత్ర మారుగంటలైనది, హోటలు భోజనము చేసి యెవరిండ్లకు వారుపోయిరి. లైలీ మనోహరులు రెండు కుర్చీలపై కూర్చుండిరి. అది యేకాంతస్థలము.

'లైలీ!'

'నాదొక శంక తీర్చెదవా?'

'అవశ్యము'

'నీవు పూర్తిగా యంధుఁడవు కాలేదని నా నమ్మకము.'

'లైలీ అవును. నా సుఖైశ్వర్యసంసారములు నీయందు లీనమై కేంద్రీభూతమైయున్నవి. నీవు నాకు బాగుగా కనుపించుచున్నావు.'

'అయినచో నన్నేల మోసపుచ్చితివి?'

'నీ ప్రేమలోతు తెలిసికొనుటకు'

'అయినచో నేను నీ ప్రేమపరీక్షలో గెలుపొందినటులేనా?'

'నిస్సందేహముగా'

* * *

నేను దంపతులు సంతసమున వారికి వివాహము గావించిరి.

నారీమణులు తమ ప్రియమనోహరుల ప్రేమపరీక్షలందు లైలీవలెనే గెలుపొందుదురుగాక.

(అనువాదము)

# సర్వవ్యాపి

శ్రీమతి గండికోట సావిత్రీదేవిగారు

అది మండువేసవి. మిట్టమధ్యాహ్నసమయము. మార్తాండుని తీక్ష్ణకిరణములచే, భూమియంతయు కాలి పొగలెగయుచున్నది. అచ్చటచ్చట వేడిగాడ్పులవలని సంచలనము, దాహమునకై అరచు కాకుల "కాకా" ధ్వనులు తప్ప అంతయు నిశ్శబ్దము.

అట్టిసమయమున సమీపగ్రామమునుండి యేతెంచు పాంథునకు ఊరిబయలనున్న, సర్వజీవుల కాశ్రితుండగు దేవుని ఆలయప్రాంగణముతప్ప శరణ్యమెద్ది? అట్టియూహతోనే, తన్నితరులుచూచిన తనకులమునుబట్టి కసరికొట్టెదరని తెలిసియుండియు, తనవంటి నిరాధారున కాధారుండా భగవంతుడేయనినమ్మి మొండిధైర్యముతో ఆలయప్రాంగణమున ప్రవేశించినాడు, పీరిగు.

అప్పటివరకు నిద్రలో మునిగియున్న అర్చకుడు సవ్వడినిబట్టి మేలుకాంచినాడు. ఇకనేమి? అర్చకుని జాగ్రత్తంతయు విఫలమైనది. పరమపవిత్రముగా నెంచి పూజించి, అర్చించుచున్న దేవుని ఆలయమందు అతిఅపవిత్రము, అతినీచము, అనిమెంచుచున్న వస్తువు ప్రవేశించినది.

అప్పటియాతని హృదయవేదన వర్ణింపనెవరితరము? తన ఆవేదనయంతయు, ఆ నిరాశ్రయునిమీద వాగ్రూపమున వెళ్ళగక్కినాడు. "ఓరీ పరమపవిత్రుడైన భగవంతుకుండు ఈ దేవళమున, లేచినదిమొదలు తలపరాని పనులుసేయుచు హేయమైన జీవితమును గడుపు నీకు ప్రవేశింప బుద్ధియెట్లుకలిగెనురా? నీ మేనిగాలిసోకినను మాస్వామికి బాధకలుగునే!"

"స్వామీ! తమకెదురాడినందులకు క్షమింపుడు. ఈసమయమున భగవంతుడచ్చటనుండడో ఈ దీనుడచ్చటకేగిన పీనిగాలి స్వామికిసోకదో సెలవిచ్చిన నే నచ్చటికే పోయెద."

అర్చకుడు నిరుత్తరుండగుటయే దానికి ప్రత్యుత్తరము.

# ఋగ్వేదసూక్తములకు స్త్రీలు ఋషులైయుండుట.

బ్ర॥ శ్రీ॥ వేంకటసుబ్బారాయుడుగారు ఎమ్. ఏ.

శ్రీ బులుసు వెంకటరమణయ్యగారు రిదివఱలో "గృహలక్ష్మి" చదువరులకు స్త్రీలు పూర్వమునుండియు సాహిత్యమున ప్రజ్ఞగలవారై యున్నట్లు తెలిపియుండిరి. అట్టి స్త్రీలలో కవయిత్రులని పేరెంచిన కొందఱి నామములను కూడ ఉదహరించియుండిరి.

హిందూస్త్రీలు పూర్వమెుక సాహిత్యముననే గాక ఇతర శాఖలలో గూడ ప్రజ్ఞగలవారై యుండినట్లు కనుపించును. వైదిక వాఙ్మయమున (ముఖ్యముగ ఋగ్వేదమున) గూడ స్త్రీ యొక్కొక్కచోట మంత్రద్రష్టిగా నున్నట్లు కానవగును. వైదిక వాఙ్మయమున ప్రాచీనతమమని యెంచఁబడుచున్న ఋగ్వేదమున స్త్రీలు కొన్నిసూక్తములకు ఋషులైయున్నారు. ఇట్టి సూక్తములు, నే జూచినంతవఱకును దశమమండలముననే విశేషముగా నున్నవి. వానిలో ప్రఖ్యాతమగు నొకసూక్తమును మాత్రము విమర్శించి మిగిలినవాని నామగ్రహణము మాత్రము జేసెదను.

## 10. 125. వాగాంభృణీయ సూక్తము.

× మం. 125 వ సూక్తమునకు, * "అహంరుద్రేభిర్వసుభిశ్చరామి" అనుదానికి అంభృణ మహర్షి కుమార్తెయగు వాక్ అనునామె బ్రహ్మవిదుషి, ఋషి యని సర్వానుక్రమణిక యందున్నది. దీనిని సాయణుడు ♦ తనభాష్యమున విశదీకరించియున్నాడు. అవిదుషీరత్న మీసూక్తమున నాత్మస్తుతి చేసికొనియున్నది. అందుచే నామెయే యీసూక్తమునకు ఋషియని సాయణుని యభిప్రాయము. ఇందు వాక్ అను పదమునకు (1) వాక్ పరబ్రహ్మము (2) లేక, వాగాత్మక స్త్రీ, అని రెండువిధముల నర్థము చెప్పుటకు వీలుండుటచే సూక్తములోని ఆశయమును కూడ రెండువిధముల సమర్థింప వీలున్నది. మొదటియర్థము చెప్పినచో వాక్పరబ్రహ్మముయొక్క స్తుతిగా నీ సూక్తమున కాశయము చెప్పవలెను.

రెండవయర్థమును జెప్పినచో, సూక్తమునకు ఋషియగు స్త్రీ, పరమాత్మతో తాదాత్మ్యము ననుభవించి సమస్తమగు జగత్తుయొక్క రూపముతో సర్వమున కధిష్ఠానదేవత యైనట్లు, తానె సర్వమునని $ యాత్మస్తుతి చేసికొనుచున్నదని వ్యాఖ్యానము చేయవలెను. ఎట్లర్థము చెప్పినను అట్టి ప్రాచీనకాలమున ఒకస్త్రీ యిట్టి యుద్భావముల వెల్లడించినదనుట ఆశ్చర్యమె యగును. ఈసూక్తమున కాశయము నిందు పొందుపరచుచున్నాను.

"నేను జగత్తునంతకు కారణభూతనై, వసురుద్రుల రూపముననుు, నాదిత్య విశ్వదేవులరూపముననుు చరించుచుంటిని. బ్రహ్మస్వరూపనై మిత్రావరుణులను,

---

* అచ్చువేయుట కష్టమనియెంచి స్వరయుక్తముగా మంత్రములు వ్రాయనందుకు చదువరుల క్షమింపకోరెదను.

♦ ముందు చేయబోవు విమర్శయంతయు సాధారణముగా సాయణుని వ్యాఖ్యానము ననుసరించియే యుండును.

$ ఇట్టి యాత్మస్తుతి సామాన్యుల యాత్మస్తుతివలె గర్హ్యమైనది కాదు. సంసారమునుండి యుత్తీర్ణులై, తన్నిమగ్నులగు జనసామాన్యము నర్థోద్దృష్టిఁ జూచి యుద్ధరింప ప్రయత్నించుచు మహాత్ములిట్టి యాత్మస్తుతి జేసికొనుట కలదు. ఇక అవతారపురుషులగూర్చి చెప్పనక్కరలేదు.

ఇంద్రాగ్నులను, నశ్వినులను తత్తత్ స్థానంబుల నిలబెట్టుచుంటిని. జగదాకారమున దిరుగుచు సమస్తమును నాయందే ఇమిడ్చుకొని యుంటిని.

అభిషోతవ్యమగు సోమమును, భగపూషత్వష్టలను స్వస్థానముల నేనే నియమించుచు, దేవతలకు హవిస్సునిచ్చు యజమానునికి ద్రవ్యము నిచ్చుచుందును. జగత్తునంతకు నీశ్వరినై యజమానాదుల ధనంబుల గూర్చుచుందును.

సాక్షాత్కర్తవ్యంబగు పరబ్రహ్మమును తెలిసికొని దానినే మీకు మద్రూపమున తెలియజేయుచుంటిని. అందుచే నేను యజ్ఞార్హులలో (దేవతలలో) (లేక దేవతలను తెలిసికొనినవారిలో) మొదటిదానను. ఇట్లు ప్రపంచాత్మనై బహుభావముతో మెలగుచు సమస్త భూతజాతములు నాలోనికి జేర్చుకొను నన్ను దేవతలు బహు దేశములయందు స్థాపనయొనర్చిరి.

మనుష్యుడు నామూలముననే భుజించుచు, నామూలముననే చూచుచు, మన్మూలముననే యాకర్ణించుచు నామూలముననే ప్రాణములు గల్గియున్నాడు. (సర్వేంద్రియములు నామూలముననే పని చేయుచున్నవి.) నన్ను గుర్తెఱుంగనివారు నశింతురు.

ఓ సఖుడా, శ్రద్ధేయమగు దానిం జెప్పుచున్నాను. ఆకర్ణింపుము. దేవమనుష్య సేవితంబగు పరబ్రహ్మమును గూర్చి నేన స్వయముగా చెప్పుచున్నాను. నే గోరినదానినెల్ల సర్వోత్కృష్టంబుగ జేయగలను. నే నేపురుషుని రక్షింపఁగోరుదునో, అట్టివానిని బ్రహ్మగా గాని, ఋషిగా గాని, గొప్పమేధావిగా గాని నందఱిలో నధికునిఁజేయ గలను.

బ్రహ్మద్వేషులఁ జంపుటకై రుద్రునకు ధనుస్సంధానమొనర్చి యిచ్చుదాననేనె. స్తోతృజనంబుకొఱకై శత్రువులతో యుద్ధమొనర్చుచుందును. భూమ్యాకాశంబుల రెంటిని నంతర్యామినై ప్రవేశించితిని. భూతములన్నింటికి మీదుగ (నెత్తిపై) నాకాశమును సృష్టించినదానను నేనె. నాపుట్టుకకు కారణముగు నంభృణమహర్షి సముద్రముమధ్య నుదకమున నివసించును. అచ్చోటినుండి నేను సమస్త భువనంబులందును వేయివిధంబుల వ్యాపించియుంటిని. మఱియు దూరమునున్న యా ఆకాశమును, కృత్స్నంబగు నవికారజాతమును కారణభూతంబై మాయాత్మకంబగు మద్దేహముతో స్పృశించుచుంటిని. నేన సమస్త భువనంబుల గారణరూపమున నుత్పాదనచేయుచు, పరాప్రేరితుడై స్వేచ్ఛాప్రవృత్తి వీచు వాయువువోలె వీచుచుందును.

భూమ్యాకాశముల నతిక్రమించిన నేనిట్టి మహిమ గలదానను."

నిజముగ నిట్టి ప్రతిభగలిగియుండి యింద్రియనిగ్రహులై మిగుల విజ్ఞానమును సంపాదించి నిజసామర్థ్యమును గుర్తెఱింగినవారు తప్ప ఇతరులిట్లు పలుక సాహసింపరు. ఇట్లు సాహసించి పలికిన ఈయువతి ఇదివఱకు చెప్పినట్లు సంసారమునుండి యుత్తీర్ణరై సామాన్యప్రజల నుద్ధరింప బయలువెడలిన ఒకమహానుభావురాలై యుండవలెను. లేనిచో నొకసామాన్య వనితయెక్కడ? పరమాత్మను నేనయని చెప్పుటయెక్కడ? పరమాత్మ సర్వవ్యాపకుడు; అట్టి సర్వవ్యాపకుని స్వరూపమును నేనేయని చెప్పగలిగిన ఈ స్త్రీ యాకాలమున మిక్కిలి మహాత్మురాలుగా పూజింపబడి యుండును.

ఒకవేళ మనము వాక్కనగా వాక్పరబ్రహ్మము అని యర్థము దీసినను, వాక్కుచెప్పినట్లుగా దాని సామర్థ్యము, మాహాత్మ్యమును వర్ణించుచు నీవనిత చెప్పిన వాక్యములుగూడ అనేకములగు నుదాహరణములతో నిండియున్నవి.

ఋగ్వేద దశమమండలము కాలమునాటికి వేదమంత్రములయందలి శబ్దగౌరవ మెక్కువయై వేదవాక్కును పరబ్రహ్మస్వరూపమను నమ్మకము బయలుదేరెను. ఈవిషయము ఈమండలానంతరమే రచించినట్లు కనబడుచున్న యజుర్వేదాథర్వణములందు సుస్పష్టముగ నున్నది. ఇట్టి పరబ్రహ్మస్వరూపమే యా "వాక్కు"ను పదమువలన నుద్దేశింపబడి యుండవచ్చును. మఱియును దీనితో నేకకాలమున రచింపబడిన ఇతరసూక్తముల దేవతల దిలకించిన యుక్తమైనట్లు కనుపించును. ఇట్లే రూపహీనములు కంఠ



"అమాయికురాలు"



"అక్రూరవరదుఁడు."



"చెలిమి"



శ్రీ రాంపియారి కన్య

కగుపడనివియగు గుణాదులును, నిర్జీవములగు శరాదులును దైవతములుగా భావింపబడి సూక్తదేవతలై దశమమండలమున విలసిల్లుచున్నవి.

ఎట్లన్వయించినను నీసూక్తమున నున్న యుదారాశయములును, నిజసామర్థ్యోద్ఘోషయు రచయిత్రి ఘనతను చాటుచున్నవి.

దశమమండలములో నిట్టివారు ఋషులై యున్న సూక్తములు మెండుగా నున్నవని చెప్పియుంటిని. అందు 39, 40 సూక్తములకు కక్షీవంతుని కుమార్తెయగు "ఘోష" యనునామె ఋషియై యశ్వినీదేవతల నారాధించుచున్నట్లు కనబడును. ఈమె కుమారుడగు "సుహస్త్య" యనువాడు గూడ అశ్వినులనే ప్రార్థించుచు 41 వ సూక్తమునకు ఋషియైయున్నాడు.

ఈమండలముననే 72 వ సూక్తమునకు, "దేవానాంనువయం జన్మ" అనుదానికి దక్షుని సంతతికి జెందిన "అదితి," యనునామె ఋషియైయున్నది. (దీనికే బృహస్పతి యనువాడు ఋషియని కూడ నున్నది.) దీనిని అనుష్టుప్ ఛందస్సులో దేవతల ప్రశంసించుచు నాయదితి వాక్రుచ్చినది. ఈ అదితి యను పదమొక వనిత పేరైనదియు లేక, దేవత పేరైనదియు తెలియక ద్వ్యర్థిగానున్నది. బహుశః నిది దేవత పేరై యుండును. ఎందుచేతనన నిచ్చట యదితికి దక్షుడు పుట్టెననియు, దక్షున కదితి పుట్టెననియు, నున్నది. ఇట్టి వాక్యము ఋగ్వేదమం దచ్చటచ్చట "అదితి" (దేవత) నుద్దేశించి చెప్పబడియున్నది. అదియును గాక "అదితి" యను శబ్దమీసూక్తములోని 4, 5 మంత్రములలో నుండుటచే నాపేరే ఋషిగా వాడబడుచున్నట్లు కనుపించును. ఇట్టి పేరుగల యువతి యుండినను నుండవచ్చును. (ఇప్పటికిని మనము పిల్లలకు దేవతల పేరుపెట్టుట వాడుకయే కదా) ఈసూక్తమున "అసత్ నుండి సత్ పుట్టెను" మొదలుగాగల తత్వజ్ఞానసంబంధమగు విషయములుగలవు. దీనినిబట్టి విమర్శకు లీసూక్తము ఋగ్వేదమున నవీనసూక్తములలో నొకటియని చెప్పుచున్నారు.

X-85. "సత్యేనోత్తభితా భూమిః" అనుసూక్తము. దీనికి ఋషి * సూర్యాసావిత్రి యని యున్నది. కాని ఈ పేరిం దుదహరింపబడియున్నది. అదియును గాక ఇందలి విషయముగూడ సూర్యాసావిత్రి వివాహమును గూర్చియే. అందుచే నాపేరే దీని ఋషిపేరై వెలసియుండవచ్చును. ఈ సూక్తమునకు సూర్యాసూక్తమని కూడ వాడుక కలదు. పాశ్చాత్యవిమర్శకు లీసూక్తమును "వివాహసూక్త" మని (Wedding hymn) అని పిలుతురు. ఇందలి మంత్రములన్నియు నిప్పటికిని నానాసందర్భముల, సప్తపదీత్యాదులయందు బ్రాహ్మణవివాహమున నుపయోగింపబడుచున్నవి. ఈసూక్తములోని మంత్రములలో సగముపైగా అథర్వవేదచతుర్దశకాండమున కొద్ది పాఠభేదముతో కానవచ్చును. ఇందు వధువు సూర్యాదేవిగను (1) వరుడు సోముడుగను, అశ్వినీదేవతలు వరుని చెలికాండ్రుగను వర్ణింపబడిరి.

X-107. వ సూక్తమునకు "ఆవిర భూన్మహిమఘోనమేషాం" అను సూక్తమునకు, ప్రజాపతిసంబంధమైన దక్షిణ ఋషియని యున్నది. దీనికి కూడ రెండర్థములు చెప్ప వీలున్నది. (1) ప్రజాపతికుమార్తెయగు దక్షిణయనునామె (2) ప్రజాపతి సంబంధమైన యజ్ఞములో నిచ్చు దక్షిణ—ఈ రెండవయర్థము—సూక్తాశయమున కనువుగానున్నట్లు తోచును. సూక్తదేవత పేరు గూడ నిట్లే, "దక్షిణగాని," దానినిచ్చు దాతలుగాని యని యున్నది ("దక్షిణాతద్దాతారో వా")

---

* సూర్యుని గుండ్రని ప్రతిబింబమే మందగమనేత్యాది గుణసామ్యముచే స్త్రీగా భావింపబడి ఇట్లు సూర్యాదేవిగ వర్ణింపబడినదని కొందరు విమర్శకు లనుచున్నారు. కాని ఈ సూర్యాదేవికిని సోమునకు గల సంబంధమును గూర్చిగాని, సోముడు చంద్రుడా సోమలతయా యను సమస్యను గాని ఎవరునువిప్పి సరిగా చెప్పలేకపోయిరి.—

X. 109. "తేఽవదన్ ప్రథమా బ్రహ్మకిల్బిషే" అను సూక్తమునకు "జుహూ" అను నామె బ్రహ్మయను నాతని జాయ ఋషియైయున్నది. ఈ జుహూ అనునామె నిరుక్తమునకు మూలమను నిఘంటువు నందును, బృహద్దేవతయందును దేవతాగణములో చేర్చఁబడినది. ఇచ్చట సామాన్య మానవ స్త్రీయైయుండిన నై యుండవచ్చును. "విశ్వేదేవు"లు దీనికి దేవతలైయున్నారు.

X. 127. "రాత్రీవ్యఖ్యదాయతీ" అను సూక్తమునకు ఋషి భరద్వాజునిసంతతికి జెందిన రాత్రి యనునామె యని యున్నది. ("లేనిచో కుశిక సౌభరుడు ఋషి"యని వికల్పముగూడ నున్నది.) ఇందు రాత్రినిగూర్చి మంత్రము లుండుటచే, నీ రాత్రిపదమును, భరద్వాజునిసంతతికి జెందిన రాత్రియను నామె పేరుతో తారుమారు చేసి దీనికి ఋషి, రాత్రీ భారద్వాజ యని చెప్పి యుండవచ్చును.

X.145. "ఇమాంఖనామ్యోషధిం," అనుసూక్తము. ఈసూక్తము మాంత్రికవిద్యకు చెందినదై నట్లు కనబడును. దీని కింద్రాణి యనునామె ఋషి. ఈసూక్తము నందొక స్త్రీ తన సపత్నిమీఁది కినుకచే నామెను సంహరించి (లేక ఆమెనుండి వేఱుచేసి) నిజభర్తను దనతో గూడ్చుటకై యొకయోషధి నాసపత్నిపై బ్రయోగించుచున్నట్లున్నది. ఇట్టి విశేషములు గలిగి యుండుటచే నీసూక్తమున కాథర్వణముతో సంబంధముండి యుండవచ్చును. (ఇట్టి సూక్తము లాథర్వణమున మెండుగ నున్నవి.) దీనినిబట్టి ఋగ్వేదకాలము నాటికే స్త్రీలలో కొందఱు మాయవిద్యలో నారితేరి యుండిరనుట నిస్సంశయము. ఈసూక్తరచయిత్రి స్వానుభవము చేసైన నిట్లు రచించి యుండవలెను. లేదా సపత్ని వలన బాధనొందుచున్న స్త్రీహృదయమును బాగుగ గ్రహించినదైన నిట్లు వ్రాసియుండవలెను.

X. 154. "సోమ ఏకేభ్యః పవతే" అను సూక్తమునకు యమ యనునామెయు

X. 159. "ఉదసౌ సూర్యో అగాత్" అను సూక్తమునకు శచీపౌలోమి యనునామెయు,

X. 189. "ఆయంగౌః పృశ్నిరక్రమీత్" అను సూక్తమునకు సార్పరాజ్ఞయు ఋషులైయున్నారు.

ఈమండలమున స్త్రీయొక్క యార్షమునను సూక్తమొక్కటిమాత్రము మిగిల్చియుంటిని. అది X. 10. "ఓచిత్సఖాయం సఖ్యావవృత్యాం" అను సూక్తము. దీనికి వివస్వంతుని కుమార్తెయగు 'యమి' యనునామెయు, నామెసోదరుఁడగు యముడును ఋషులైయున్నారు. ఈసూక్తమున నాయిద్దఱకును సంభాషణకలదు. ఇందు యమి, నీతివిరుద్ధముగ నిజసోదరుని కలయఁగోరి బలవంతపెట్టును. కాని యాతడందులకు సమ్మతింపక, యట్టిపని లోకవిరుద్ధమనియు, నట్టితలంపును మానుమనియు సోదరిని చీవాట్లుపెట్టును. అంతట నామె నపుంసకుడని యాతని దిట్టి లేచిపోవును. ఈయమి పురాణప్రఖ్యాతయగు యముని సోదరియగు యమి యగునో కాదో చెప్పజాలము. ఈమె సామాన్యవనితయే యైనయెడల స్త్రీజాతికే కళంకము తెచ్చినదగుచున్నది. మిగుల పవిత్రమైనదని యెంచబడుచున్న వేదమున నిట్టి యనైతికమును సంభాషణ కేల తావుగల్గెనో చెప్పజాలము. దీనినిబట్టి ఋగ్వేదకాలమునాటి ప్రజలు ప్రపంచమునకు వెఱచుచుండెడి వారనియు, అంతటి ప్రాచీన కాలమునగూడ కొంతవఱకు నీతిమార్గమునసే చరించుచుండెడివారనియు, నెక్కడనో నూటికొకరు దుర్నీతిపరులగు కులట లుండెడివారనియు తోచును.

ఈసూక్తములుగాక ఋగ్వేదము నందతటను మఱి యొక్కటే, స్త్రీ ఋషిగాగల సూక్తము కానవచ్చుచున్నది. అది అష్టమమండలములోని, "కన్యావార వాయతీ" అను 91 వ సూక్తము. దీనికి అత్రిమహర్షి సంతతికి జెందిన "అపాలా" అనునామె ద్రష్టి. ఈసూక్తమున పై సూక్తములలో వలె గాక, ఇంద్రుడు దేవతయైయున్నాఁడు. ఇందింద్రవర్ణన, ఋగ్వేదములోని మిగత యింద్రసూక్తములలో వలెనే

యున్నది. ఇట్టిసూక్తములు ఋగ్వేదమున సామాన్యములై యున్నవి. దీనినిబట్టి వర్ణవయందేమి, ఆశ్రమములయందేమి స్త్రీలు పురుషులకు తీసిపోలేదనియు, అవకాశము లేకపోవుటయు, అట్టి వర్ణనాదులయందలి స్త్రీలశక్తి నీరుగవిడిచిన నిప్పువలె ప్రకాశము నొందకుండుటకు కారణమై యుండుననియు దోచును.

మఱియొక విశేషము గలదు. స్త్రీలయార్షమునను సూక్తములు 8.91 తప్ప శేషించినవన్నియు దశమ మండలములోనే కానవగును. దీనికి కతంబేమైయుండును?

ప్రథమ దశమమండలములు వినా శేషించిన ఋగ్వేదమండలములలో లౌకికవిషయములనుగూర్చిన ముచ్చటయే గానరాదు. మిగత మండలములలో (2—9 మండలములలో) సదా దేవతారాధన దప్ప మఱే యేవిషయములను కానరావు. ప్రథమదశమ మండలములందుమాత్రము వివిధవిషయములనుగూర్చి చెప్పబడియున్నవి. వీనిలో ముఖ్యమగు విషయములు, వివాహసూక్తము, యమయమీసంవాదము, హిరణ్యగర్భసూక్తము, ప్రపంచోత్పత్తినిగూర్చి ముచ్చటించు ఇతర సూక్తములు, శచీంద్రసంవాదము, ఊర్వశీపురూరవుల సంవాదము, పితృమేధము, మంత్రవిద్య—మొదలైనవి. ఇట్టి లౌకిక తాత్వికవిషయములతోపాటు స్త్రీయొక్క యార్షమునను సూక్తములుగూడ పదియవమండలముననే యున్నవి. 1,10, మండలములు, శేషించిన మండలములకంటె నవీనమైనవని విమర్శకుల యభిప్రాయము. ఋగ్వేదమున ప్రాచీనతమమని తలంచబడుచున్న కౌటుంబికమండలములలో (Fami ly Books) అనగా 2-7 మండలములలో స్త్రీ విరచితసూక్తములు లేనేలేవు. ఇందులకు కారణము తదభావమైన కావలెను, లేదా యానాటి కాలమున స్త్రీ యనగా చులకనగా చూచు పురుషుల యలక్ష్యమైన కావలెను. ఈ రెండుకారణములును గూడ సమంజసములైనట్లు తోచుచున్నది.

మిక్కిలి ప్రాచీనకాలమున, అనగా ఆర్యులు హిందూదేశమునకు క్రొత్తగావచ్చిన దినములలో దేశమంతయు నరాజకముగనున్నట్లు మనకు కౌటుంబిక మండలములవలన తెలియుచున్నది. వారి ప్రార్థనలన్నియు వీరులగు పుత్రులకొఱకును, పశురూపధనముకొఱకునై యున్నవి. వారెల్లప్పుడు యుద్ధములనే నిమగ్నులగుట, తమ యుద్ధప్రభువగు ఇంద్రునే కొలుచుచుండిరి. ఇట్టి కల్లోలముగానున్న సమయమున నబలలగు స్త్రీలంతగా పైకిరాకపోవుట యాశ్చర్యజనకము కాదు. అప్పటికోజాలలో స్త్రీలు ప్రజోత్పత్తికే పుట్టియుండిరని నమ్మియుండిన పురుషులకు బరువై తోచుచుండెడివారు. ఇట్లే పురుషులు ఆడవారిని చులకనగా చూచుచుండెడివారనుటకు నిదర్శనములు నవీనవైదికవాఙ్మయము తిరగవైచిన కొలదని విశదమగును. ఋగ్వేద దశమమండలమందును, యజురాథర్వణ వేదములందును స్త్రీ అతినీచముగ చూడబడుచుండిరనుటకు నిదర్శనములుగలవు. ఋగథర్వణములలో స్త్రీలు మాంత్రికవిద్యచే దుశ్చేష్టలగావించినట్లు గలదు. యజుర్వేదమున ఆడపిల్లలను పుట్టినవెంటనే వదలివేసెడివారని యున్నది. (ఇప్పటికిని ఆడుపిల్ల పుట్టినదన్నంతనే హేయముగ భావించువారు కొందఱుకలరు.)

స్త్రీలయందు పురుషుల కిట్టి దురభిమానముండుటచే మిక్కిలి పవిత్రములని యెంచబడుచున్న కౌటుంబికమండలములలో స్త్రీల యార్షమునను సూక్తములు కానరాకపోవచ్చును. కాని అట్టి సూక్తముల యత్యంతాభావమే సమంజసమగు కారణమని తోచును. ఏలననగా పైజెప్పినట్లు అరాజకముగానున్న కాలమున, ప్రాణాపాయస్థితిలో నబలలగు స్త్రీలకు నిశ్చింతగా కూర్చుండి కవనముచేయునట్టి, శాంతి యెక్కడిది? పురుషులవలెనే ఇంద్రు నారాధించిన (8-91 చూడుడు) "అపాల"యె అట్టి ధీరయైనట్లు కాన్పించును.

దశమమండలము నాటి కాలమునకు దేశమునకొంత శాంతి చేకురినట్లు కనబడును. అందుచే మనకు మన శైత్యమున వ్రాయబడునట్టి వివిధవిషయముల గురించిన

ప్రస్తావము దశమమండలమున కనుపించును. ఈకాలమునను్న లౌకిక తాత్విక వాదములలో స్త్రీలుగూడ పాల్గొనుచుండి యుందురు. అందుచేతనే మనకు వాగాంభృణివంటి బ్రహ్మవిదుషి జ్ఞానబోధచేయ గల్గినది. (10-125 చూడుడు)

ప్రథమమున కౌటుంబిక మండలములే యుండెననియు, తరువాత శేషించినమండలము లాముఖ్యభాగమునకు చేర్చబడెననియు ఋగ్వేదరచననుగూర్చి యొక వాదము గలదుకదా. ఏమహనీయుడు, "ఓచిత్సఖాయం" అను యమయమీ సంవాదము, "ఇమాంఖనామ్యోషధిం" అను మాంత్రికవిద్యకు సంబంధించినసూక్తము, వివాహసూక్తము, మండూకసూక్తము, మొదలగు వేదమని పిలువబడుట కర్తలేని సూక్తముల గూడ దశమమండలమునజేర్చి యీమండలమును గూడ ఋగ్వేదముఖ్యభాగమునకుజేర్చి ఋగ్వేదమునకు "దాశతయీ" అను పేరును కల్పించెనో, అతడే, స్త్రీరచితములను దురభిమానమువదలి, అనేక యుద్భావములతో నిండియుండి తత్వజ్ఞానరస మొలుకుచున్న వాగాంభృణీయాది సూక్తముల గొన్ని ఏరి దశమమండలమునజేర్చి యుండవచ్చును. కాని ఇట్టి సూక్తములకు కౌటుంబికమండలము లందుమాత్రము స్థలము లేకపోయెను.

మనము తిలకించిన సూక్తములన్నియు కేవల తాత్వికవిషయములు గాని, కేవలైహికవిషయములు గాని యైయున్నవి. ఇట్లు స్త్రీలు తాత్వికవిషయములలో పాల్గొనుట కిదియే మొదలని తోచును. యజురాథర్వణవేదముల కాలమునాటికి స్త్రీలు పురుషులతో బాటు సభలలో వాదములుగూడ సలుపుచుండినట్లు గోచరించును. ఇందులకు నిదర్శనము యాజ్ఞవల్క్యుని భార్యయగు మైత్రేయియను తత్వజ్ఞ.

ఇట్లత్యంత ప్రాచీనకాలమున గూడ, స్త్రీలు సాహిత్యమునందే గాక వేదాది వివిధశాఖలలో గూడ ప్రావీణ్యము సంపాదించియున్నారని మనవి చేయుచున్నాను.

---

## హరిజన ఘోష

శ్రీమతి చర్ల నగరాజకుమారిగారు

(కాళింగడరాగం)

ఓయోయి! దైవమా! ఆలింపవోయి!
మాదైన్యబ్రతుకింత వీక్షింపవోయి!
పెద్దవీధులవెంట నడువగారాదంట
నీవున్న గుడిలోని కెళ్లగారాదంట
మైలజెందుదువంట
ఓయోయి! దైవమా! ఆలింపవోయి!
మాదైన్యబ్రతుకింత వీక్షింపవోయి!
నీకెమైలంటుచో మైలగానిది యెద్ది?
లోకమంతయునీదు సంతానమేగాద?
ఓయోయి! దైవమా! ఆలింపవోయి!
మాదైన్యబ్రతుకింత వీక్షింపవోయి!
నిన్ను గొల్వగనీరు తమపజ్జరానీరు
ఏరీతిమనుదుమో? ఏరీతినుందుమో?
ఓయోయి! దైవమా! ఆలింపవోయి!
మాదైన్య బ్రతుకింత వీక్షింపవోయి!

---

# దుర్గావతి

ఆర్. యస్. పట్నాయక్‌గారు, బి. ఏ.

పదునాఱవ శతాబ్దమున బుందేల్‌ఖండు సంస్థానాధీశులలో "చందవేల్" అనునతఁ డగ్రగణ్యుఁడు. ఆరాజన్యునికి గుణసంపన్నురాలగు కూఁతురొకతె జనియించెను. సర్వలక్షణ సౌభాగ్య జన్మభూమియై ప్రకాశించుచు, దుర్గావతి యను నామమున దినదిన ప్రవర్ధమానయై పెఱుగుచుండెను. ఆమె గుణరూపసంపదలను విని, పరిసరప్రదేశముల నుండి రాజపుత్రు లెందరు వచ్చి యడిగినను తన పుత్రికకు వా రనుగుణవరులుకారని పంపివైచుచుండెను. తుదకు గాఢా సంస్థానాధీశుఁడగు గోండురాజుయొక్క శౌర్యపరాక్రమములను విని తన కొమరిత బద్ధానురాగయైనదని తెలిసికొని గాఢా రాజపుత్రుఁ డనాగరికుఁడైనను, చందవేల్, పుత్రికయొక్క అభీష్టమును నెఱవేర్పవలసివచ్చెను.

దుర్గావతి దయామయి, వివాహానంతర మత్తవారింటికి వచ్చునపుడు జనకుని రాజ్యమునకు జెందిన బీదసాదలకు ధనరాసులు, భూమ్యాదిదానములు విరివిగ నొసంగి శాశ్వతజీవనము లేర్పరచెను.

భర్త విషయలాలసుఁడై, రాజ్యక్షేమము లరయక, క్రీడాసక్తుఁడగుట గని రాణి వానిని సద్వర్తనమునకు మరల్ప వేవిధముల ప్రయత్నించెను. ప్రయత్నములు విఫలము లయ్యెను. అట్లగుటయేకాక, తీవ్రతరమగు వ్యాధి తగిలి రాజు మృతినొందెను. రాజ్యభారము రాణిపై బడెను. చీకటిలో వెలుగనునట్లు గర్భవతిగ నుండిన నామె కాసమయముననె పుత్రోదయమయ్యెను. రాజ్య మల్లకల్లోలముగ నుండెను. ధీరయైనను అట్టి సమయమున పాప మామె చేయఁగలిగిన దేమికలదు?

ధీరత్వమును పురికొల్పి, భర్తృవియోగదుఃఖమును దవ్వులకు జోపినది. ప్రజాసంక్షోభనుమాన్పి శాంతిస్థాపనమొనర్ప రాజకీయరంగమున ప్రవేశించెను. ప్రవేశించిన అచిరకాలముననే ప్రజలబాధలు నివారణమైనవి. శాంతియుతమగున్యాయము, నీతియు ధాత్రిపై నెలకొనినవి. రాణి, ద్వాదశవర్షప్రాయుఁడగు తన పుత్రునికి పట్టముగట్టి అతనిపేరిట తానే రాజ్యవ్యవహారములను చక్కబెట్టుచుండెను.

ఐదు సంవత్సరము లిట్లు సుశాంతముగ గడచినవి. రాణి సమకాలికుఁడగు అక్బరు చక్రవర్తికి రాజ్యవిస్తరకాంక్ష జనించెను. ధనసంపదలచే తులతూగు బుందేల్‌ఖండుపై దృష్టిని బఱపినాఁడు; సింహాసనస్థుఁడయ్యు నామమాత్రుఁడగు బాలు నొక "చెఱుపుజఱిచి" అబలయగు రాణి నీవలికీడ్చి బుందేల్‌ఖండును మొగల్‌సామ్రాజ్యమున జేర్పవలయుననున దాతని కోర్కె.

అట్లగుట, "ఆసఫ్‌ఖాను" అను సేనానాయకుఁడు కొంతసేనతో బుందేల్‌ఖండుపైకి పంపబడినాఁడు. ఆకస్మికముగను, అకారణముగను పైబడ నుంకించుచున్న మొగల్ సేనను, అబలయయ్యు, సధైర్యయై వీరపురుషోచితకవచమును ధరించి, కరిని లంఘించు కేసరికరణి పదివేల సైన్యమును జేర్చి, ఎదుర్కొనెను. అల్పసంఖ్యాకులగు యవనసైనికులు మహాజలధివలె నగపడిన గాఢా సైన్యము నెదుర్కొనజాలక పలాయితు

లయిరి. పలాయనమైన సేనను మరల చేర్చి, యవనసేనాని గాథాపై ఆకస్మికముగ బడెను. మొగలుల ఫిరంగులకు వెఱచి, సైన్యము వెనుకకు తిరిగినది. పిన్నవయస్కుడయ్యు రాజపుత్రుడు బాలకేసరివలె ప్రకాశించుచు శత్రుసేన నొకప్రక్క చెండాడుచుండ, గాథాసైన్య మాబాలనృపు ననుసరించుచుండెను. కొంతసేపటికి శత్రువులు కురియుచున్న బాణపరంపరలు బాలుని మూర్ఛిల్లజేసెను. సైనికులు విగతధైర్యులై వేరొకచో దుండగీడుల దండించుచున్న రాజమాత కాదుఃఖవార్తను నివేదించిరి. దుఃఖావేశమున కూలబడుట కింత కంటె విషమసమయముండునా?

లేశమైనను చలింపక, అపు డాధీర, పిల్లవానిగూర్చి పరితపించుట కది సమయము కాదనియు, ఆహవపరిపూర్తియగువరకు తాను వచ్చుటకు వీలులేదనియు ధైర్యమునుపూని విజయలక్ష్మిని జేకొనుటయే తమ కర్తవ్యమనియు సైనికుల కుత్తరువొసంగెను. మూర్ఛావివశతఁబతితుడగు బాలుని సైనికులు శిబిరమునజేర్చి తమ పనులు నిర్వర్తింపబోయిరి.

జయాపజయము లెవ్వరివో తెలియకుండెను. యుద్ధము హోరాహోరిగ జరుగుచుండ రణదేవత రోషరక్తాననయై నలుదెసల యుద్ధభూమిని తాండవమాడుచుండెను. గోండుసైనికులు తమ ఏలికసాని ననుసరించి వీరాతిరేకమున ప్రాణములపై ఆశవీడి పోరుచుండిరి. తురుష్కులకు జయము గల్గునటులుండెను.........సజీవులగు స్వల్పసైనికులతో రోషారుణకాంతులు మోముపై లాస్యమొనరింప అగ్నికణముల కురియుచుండు రాణి ధాటి కాగలేక మొగల్ సేనాని దూరస్థుడై బాణముల నేయ జొచ్చెను; అందొకటి రాణి కపాలమున నాటుకొని గాఢమగు గాయ మొనరించెను. రాణి లేశమైనను చలింపలేదు; తీక్ష్ణజ్వాలలనుకూడ విరమింపలేదు. కాని, క్రోధాయమానమానసయై ఆ వీరనారి, మహిషాసురమర్దనివలె మరింత దీర్ఘముగ శత్రుమూకను దునుముచుండెను.

సైనికు లిరుపక్షములందున చాలమంది మడసిరి. జయోదయమబ్బు సూచన లామె కగపడకుండెను. ప్రాణపదముగ బెత్తిగిన పుత్రుడు పరలోకగతుడయ్యెను. నిరపరాధులగుప్రజ లెందరో హతులైరి. ఆ నారీమణి కిక ఇహలోకమున నేమున్నది? ఇంతలో రాణిగారి కత్యంతభక్తుడగు సైనికుడొకడరుదెంచి, "అమ్మా, శత్రులు మిమ్ము పట్టుకొనుట కిటువచ్చుచున్నారు. ఆలసింపక పలాయనమగుట మంచిది. తమ సెలవైనచో ఒరులకు తెలియనీక మిమ్మావలికి సురక్షితముగ గొనిపోయెదను" అని వేగిరపాటును సూచించుచు చెప్పెను. సైనికుని వచనములను వినిన రాణికి హృదయచలన మొదవెను. పలాయనమగుట వీరనారి కనుచితము. శత్రుహస్తగతయగుట, పవిత్రమగు తన దేహమును పరులు స్పృశించుట, ఇవి ఆమె వ్రతమునకు విరుద్ధములు.

పవిత్రమగు తన దేహము శత్రుహస్తగతమగునేమో యను భయము తప్ప

వేరొండు ఆలోచన ఆమె కప్పుడులేదు. కాలుకదల్చుటయే తడవుగ జరకాంక్షిత మగు వీరస్వర్గపద మామెకు సిద్ధము. క్షత్రియ కాంత కుచితమగు ధర్మమును తాను నిర్వర్తించినది. క్షణికమగు రాజకీయజయము సిద్ధించినను అది ఆమెకు తృణప్రాయమే. రాణియగుట ప్రజాక్షేమము నపేక్షించియే. ఉదగ్రమైన ఆహవదీక్షాభరము వహించి శత్రువుల నెదుర్కొనెను. జీవితపరిమితి సమాప్తమగుచున్నది. జయాపజయములు దైవాధీనములు. దానతన కేమి?...... కాని ఇప్పు డామె స్వార్థమునకైన వీరస్వర్గపద చింతను విస్మరించినది.

స్త్రీలకు మానమే ప్రాణము. అందును క్షత్రియకాంతకు మానసంరక్షణ ప్రాణరక్షణకన్న ప్రధానమైనది; స్వార్థకాంక్ష యగు మోక్షపదవి తరువాతి సంగతి. దీర్ఘాలోచన మొనరించి రాణి ఆప్తుడగు తన సేవకు నొకనిని బిలిచి మ్లేచ్ఛులు వచ్చులోపల తన్ను వధింప నాజ్ఞయొసంగి ఖడ్గమును వాని కందిచ్చెను. గడగడ వడకుచు, అట్టి ఘోరకృత్యమునకు చేతులాడకున్న వని వాడా ఖడ్గమును క్రిందబడవైచెను. శత్రులు కనుచూపుమేరకు వచ్చిరి. ఆమె చకితయైనది. తృష్ణాత్వరాయమానమానసయై, శోణితదీప్తిచే మెఱయుచున్న తన ఖడ్గమునకు భక్తియుతమగు ప్రణామమాచరించి, రత్నమాలికాభరణభూషితమగు కంఠము అర్పణ మొనరించెను.

దేహము నశించినది కాని దుర్గావతి నామము యశోవిరాజితముగ వెలయుచున్నది. జబ్బల్‌పురమున నీమె సమాధి యిప్పటికిని మనము చూడగలము. గుణవర్ణనాత్మకమై పూర్వకథను దలపించుచు శిలాశాసనమొకటి సమాధికి సమీపమున గలదు. అచటి కేగినవారందరా సమాధిని జూచి, ఆయమ శౌర్యపరాక్రమములకు ప్రజాహితార్థబుద్ధికి, త్యాగశీలమునకు జయవెట్టుచుందురు. నిజధర్మమునకే ప్రాణము లర్పించిన మహనీయురాండ్రు ఇట్లే యెందరో అవతరించి, జన్మభూమిని పావనమొనరించుచు, భావిసంతతి కాదర్శప్రాయులగు లగుచున్నారు.



# తెనుగుసీమ

శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారు

ఎందరెందరో ఘనసుధాస్యందిలేఖ
నుల తెనుగుసీమ ధనధాన్యనిలయమనుచు
వ్రాసిరేకాని; నేడది వ్యర్థమయ్యె!
కనుపుకాలెడి వారలఁ గాంచుకతన.
ఎందరెందరో రుధిరనిష్యందిలేఖ
నుల తెనుగుసీమ యోధసంకలితమనుచు
వ్రాసిరేకాని; నేడది వ్యర్థమయ్యె!
వీరుడొకడును కలుగని కారణమున.
ఎందరెందరో వరమధుస్యందిలేఖ
నుల తెనుగుసీమ ప్రణయమండలమటంచు
వ్రాసిరేకాని; నేడది వ్యర్థమయ్యె!
ప్రణయతత్వమ్మె తెలియనిప్రకృతియగుట.

# కురంగీ పంచకము

శ్రీమతి చిల్కపాటి సీతాంబగారు

భ్రమ:—

ఉ॥ గ్రక్కున నీకిరాతపురిగాంచి తపోధనులుండు తావటం
చిక్కు రణింజరింతు, వినవిచ్చటిచిల్కలుగూడ క్రూరమా
వాక్కులఁజేల్చు, జంపుడు, జవంబున నెత్తురుద్రావుడంచు బల్
కక్కసమాడుటల్ వినవుగా హారిణీ తెరవేది నీకికన్!॥

హారిణి:—

సీ॥ ఏవంకఁబరువెత్తిపోవఁజూచిననైన నొగి నల్దెసలవలలొడ్డియుండె
దప్పిచే కడుపారఁ ద్రావఁబోయిన నిండు సలిలము ల్గరళసంకలితమయ్యె
అడుగ త్తిపెట్టుటకైనఁ గూడక ధరాస్థలినిండ గాలముల్ ద్రవ్వియుండె
ఏజాడఁబోవఁగా నెంచ నల్దిక్కుల దావానలప్రభల్దరియుచుండె.
గీ॥ కరములందునఁ చాపముల్ గ్రాలుచుండ అక్కటా వ్యాధుఁడదిగో నన్ననుసరించె
చిన్నిశిశువుల కాపదఁ జెందకుండ ఎట్టులావలఁబోదు నాకేదిదిక్కు?॥

ఉ॥ కట్టెదుటన్ శరాసనము గైకొని నారిబిగించి యమ్ములన్
గొట్టఁగనుండె వ్యాధుఁడదిగో భయదాకృతి, వహ్నికీలికల్
జుట్టెను, సారమేయములు జూడ భయంకరలీల నార్చుచున్
బిట్టుగలంపసాగె, కడుభీతిని జెగ్గిలి శాబకంబు లి
ట్టట్టులఁబారసీ విపుడె; హా! కడుగర్భభరంబు గల్గె నే
నెట్టులఁబోదు నీయిడుమ? కెవ్వరి వేడుదుఁ నేమిసేయుదున్?॥

మ॥ కరుణాదృష్టిని జూడు వాగురిక నాకాయంబునందుండు, నె
త్తురుమాంసంబుల నీవగైకొనుము, జేతున్నీకు వేమ్రొక్కు లా
దరమొప్పార మదీయమాస్తనముమాత్రంబాసఁగైకోను, నా
వరశాబంబుల కిచ్చుకొందు జని, హా! వాపోవుచున్ బచ్చికల్
గరువంజాలవు నాదు రాకకయి మార్గంబున్ బ్రతీక్షించుచున్॥

దైవకృప:—

గీ॥ గొనము దెగిపోయె మూడుతుత్తునియలౌచు, విల్లుఫెళ్లున ధరణిపై విరిగిపడియె,
అగ్నికీలలకోడి మహారయమున శునకములుపోయి వ్యాధులఁ జుట్టుకొనియె,
కడమవాగురు లగ్నిచేఁ గాల్పఁబడియె, యెచటనో చేరెడంత మబ్బేలియపుడ
యింతలై యంతలౌచు కొండంతబ్రబలి చిటుకుపటుకున సన్నని చినుకులెసఁగి
జల్లుజల్లున వర్షించె, సమసె వహ్ని, హారిణి సంతానములతోడ నతిసుఖమున
తావునకుజేరి సుఖమునఁ దనరె; శౌరి కరుణగల్గిన నాపదల్ గడచు నిటులె॥

# బల్లాలు–బాణాలు.

శ్రీమతి ఎడవల్లి జానకీబాయిగారు

సాహెబులపేటకంతకీ ఒకటే కుళాయి. ఆ పేటలో పెద్దపెద్దభవనము లేమీ లేవుగాని, మట్టిగోడల తోటి కట్టినయిళ్ళు చాలయిరుకుగా ఒకదానిమీద వొకటి కట్టివున్నాయి. ఇళ్లముందరే రొంపున్నూ కుళ్లునీళ్ల ప్రవహాలు విషపూరితమైన వాయువులతో ప్రవహిస్తూవుంటాయి. ఆరోజు శుక్రవారం. సాయంత్రం అయిదయింది. ఆ కుళాయిచుట్టూరా యిసుక వేస్తే రాలనంతజనం మూగివున్నారు. అక్కడవున్న కుండలకీ బిందెలకు లెక్కలేదు. ఆరోజు ప్రొద్దున్న అధికవర్షం కురియటంచేత దుమ్ము లేగుతూ వుండే రోడ్డు, అడుగేస్తే అంటుకుపోయేటట్టు తయారయింది. కుళాయిచుట్టురా చాలాబురదగా, నీళ్లు పట్టుకోటానికి యిబ్బందిగావుంది. వచ్చినజనం ఎవరి బిందెలోవారు, ముందర నీళ్లుపట్టుకుందామని తంటాలుపడుతున్నారు. ఒకమనిషి కుళాయినొక్కి నీరు తనబిందెనింపుకుంటోంటే, చీకటిపడుతోందనే తొందరకొద్దీ, తక్కినవాళ్లవిసుగుద లెక్కువై పోతోంది.

"సురేరావుపేటలో అందరు ధనవంతులవటం చేత యింటికి మూడుకుళాయిలు చొప్పున పెట్టారు. మనపేటకంతకీ వొకటేకుళాయి" అంది ఒక యిల్లాలు.

"కుళాయిలెన్నున్నా అసలు ఆకుళాయిచెరువులో సరిపోవునీరులేందే." అంది ఇంకొకామె, కుళాయిచెరువుకేసి చూపిస్తూ.

"కావలసినంత నీరువుంది, యీక్రింద" అంది వేరొకామె అప్రక్కకుండుమీద వున్నయినుప మూతకేసి చూపిస్తూ. "దాల్లోంచే వస్తుంది మనకి నీరు. ఆనీరు మనచేత త్రాగించి ఆసుపత్రులకు రోగుల లోటు లేకుండా చేస్తుంటారు. పాపము". అందామె.

ఆమె ఒక వీధుల తుడుచువాని భార్య. ఆమె చెప్పినదాల్లోకూడ కొంచం నిజంవుంది. యిల్లాళ్ల సంభాషించుకొంటోంటే ఘర్లాంగుమారంలోంచి పిలుపులు వినిపించాయి.

"ఏమిటాసోది"? అని విసుగుదలతో అంది ఆ గుంపులోవున్న ఓముదుసలి.

"పిరీ-ఈ; పిరీ-ఈ-ఈ-ఈ" అని పిలుస్తోంది ఒకామె, కనుచూపుమేరలో కనిపించు యింటి గుమ్మమువద్ద నుంచొని.

"వొస్తున్నా" అంది కుళాయిదగ్గరవున్న ఒక పన్నెండేండ్ల బాలిక. "నేనింకా నీరుపట్టలా" అంది మరల భయంతో.

"నీరుపట్టలా? అరగంటనుంచి, ఓసి సిగ్గుమాలిన దానా" అని కేకలువేసింది గుమ్మంలో నుంచున్న యిల్లాలు. "బాతాఖానీ వింటూ కూర్చున్నావు కదూ? దబ్బున దయిచెయ్యి" అంది.

పాపమా బాలిక అరగంట నేపటినుంచి నీరుపట్టుకొనుటకు వీలులేక, కుండపుచ్చుకుని నుంచునేవుంది. అక్కడ ఎవరితొందర వారిదే. అందులోనూ చిన్నపిల్ల. ఆపిలుపులు, ఆతిట్లు, ఆకేకలు వినుసరికి, అక్కడున్నజనం పిల్లమీద జాలిపడి ఆమెకుండ నింపుకొనుటకు తావిచ్చారు. పిల్ల కుండలో నీరు పట్టుకుంటున్నంతసేపు 'దబ్బున తగలడూ' అని తిడుతూనే వుంది ఆ గుమ్మంలో నుంచున్నామె. నీరు పట్టుకొని, ఆపిల్ల తొందరగా నడచి వెడుతోంది. కాని రోడ్డు బురదమయం. పిల్లకూడా చాలనీరసస్థితిలోఉంది. ఆ తొందరనడకలో కాలు జారి క్రిందపడింది. కుండ బ్రద్దలైపోయింది. ఓటికోలు ధ్వనిచేస్తూ, ఆధ్వనిలో పిల్లయేడుపుకూడా మిళితమైంది. పాపమాకుండ ఆమె కాలుమీదపడి కాలు గీసుకుపోయి నెత్తురొచ్చింది.

గుమ్మమునద్ద నుంచున్నామె బాణములా ఈమె వద్దకువచ్చి, ఏడ్చుచున్న పిల్లజుట్టుపట్టి యింటికి యీడుస్తూ లాక్కుపోయింది.

కుళాయివద్దనున్న జనులందరికి ఆకృత్యం చాల బాధనిపించింది. వారంతా జాలిగుండెలతో 'పాపము అదృష్టహీనురాలు వీరమ్మ అల్లాగే వుంటుంది, తల్లి చచ్చిపోయి తండ్రి మళ్లీ పెళ్లి చేసుకుంటే' అన్నారు.

౨

వెర్రిబాగుల వెంకయ్య తన బిడ్డలకు సంరక్షకు లుండరేమో నని భయంకొద్దీ మంగళసూత్రం రెండోమాటు రావమ్మ మెళ్లో కట్టాడు. సుబ్బయ్య—అతని కొడుక్కి పద్ధెనిమిదేళ్లుంటాయి. పూర్లో ఫేక్టరీలో కూలిపని చేసుకుంటున్నాడు. రోజుకు పదణాలు సంపాదిస్తాడు. అంతజీతం తెచ్చుకుంటున్న కొడుకునిచూచి చాల గర్వపడేవాడు వెంకయ్య. ఇతనికి రావమ్మయెడల సంతానము లేదు.

వెంకయ్యకు నలభయ్యోపడి వచ్చింది. అతను ఒక గుడ్డల వర్తకునివద్ద కూలికుండి బట్టలమ్ముతున్నాడు. సంసారమునందు విరక్తిపుట్టింది వెంకయ్యకు. రావమ్మతోటి కాపరం చేయలేక పోయేవాడు. సముద్రకెరటాలు ఎప్పుడూ కొండలికి తాకునట్లు, రావమ్మ వద్దనుంచివచ్చు కోపకెరటాలు వెంకయ్య కెప్పుడూ తగులుతూనే యుండేవి. ఈ కెరటాల ఉష్ణతకు, వేసవియెండలకు, వెంకయ్య యెండలో పడవేసిన వల్లిలా మాడిపోయేవాడు. మనస్సునకు ఎప్పుడు శాంతియుండేదికాదు. వీటన్నిటికన్న తన బిడ్డల యెడల రావమ్మచూపు అనాదరణ చూస్తోంటే వెంకయ్యకు హృదయభార మెక్కువై, తనమాంసమును గోళ్లతో గిస్సున్నట్టుండేది. సవతితల్లి తన కూతుర్ని తిట్టి కొడుతోంటే యేమీచేయలేక, కళ్లు మూసుకుని "నాకళ్లు కాలిపోను. యివన్ని చూట్టానికి నాకు కళ్లుపెట్టినట్టున్నాడు దేవుడు. కళ్ళు యీపళంగా మూసుకుపోతే బాగుండును, శక్తుండీ వీళ్లని రక్షించలేని నాచేతులు, కాళ్ళు విరిగి ముక్కలైపోను" అని తన్నుతానే తిట్టుకునేవాడు. అయ్యో! మృదుమధుర మైన వాక్యాలచేత, క్రూరమైన పెద్దపులిని మచ్చికచేయగలమా!

ప్రతిరాత్రి వెంకయ్యకు యింటికివెళ్లట మనేది ఓ గండమనిపించేది. కసాయివాని యింటికెళ్ళు మేకలా, యింటికి వెళ్లేవాడు. ఆరోజు సాయంత్రం వెంకయ్యమనస్సు మరీవిచారకరంగా ఉంది. ఆ బురదలో నడవటంవల్ల, అచల్లగాలికి వెంకయ్య వొణుకుతున్నాడు. ఇంటికి వెళ్ళటమంటేనే వొణుకు వెంకయ్యకు. ఇంటివీధిగుమ్మం ఓరవాకిలిగా తెరిచియుంది. వెంకయ్య నాలుగు గజాల దూరంలో నుంచున్నాడు—అ - కాను; నుంచుండబడి పోయాడు......రావమ్మ కోపపూరితమైన సింహగర్జనలు విని. ఒక్కొక్క గర్జనవింటోంటే వెంకయ్య ప్రాణాలు పైనపోతున్నాయి. హృదయవేదన యెక్కువౌతోంది. ఆగర్జించు సింహమునకాహుతియగుచున్న దెవరో వెంకయ్య పూర్తిగ యెరుగును. కాని కదలలేడు. కాళ్లాడవు. చేతులాడవు. భయమెక్కువౌతోంది.

"నాయింటికి నీవెక్కడ దాపరించావే. శని ముండా. ఇల్లూపవటానికేనా తీరుబడిలేకుండ పని తోటి వూపిరాడక చస్తున్నానా? నీమొగం తగలెయ్య. అంటగిన్నెలు తోమలేదు. ఇంకయేమి పనిచేసి తగలడ్డావే. నీబొందపని."...........
"........."

మాట్లాడవేం. నోరుపడిపోయిందా? మొన్నమ్మవారు నిన్నేనా వేసుకపోయిందికాదే. నిన్ను కాటికీడ్చ. ఇందాకటినుంచి నన్ను గురించి ఆకులాయి దగ్గర యేమిచెప్పావు? చెప్పు. నోరెత్తిమాట్లాడు, లేకపోతే నోట్లోపాడుస్తా. గుడ్లెట్టి ఎల్లాచూస్తావే, గుడ్లగూబలా. నీచూపు నేలబడ"

"నేను-నిన్ను-గురిం-చి-యేమి-చెప్పలా...ఉ||ఉ|| ఉ||-నేను రెండు-మాట్లు-యిల్లూడ్చా-నే నిందాకనే-అంట్లుతో-మానమ్మ"

"ఏమీ చెప్పలేదూ? వెళ్లినది మొదలు నీళ్ళు పడుతూనే వున్నావు, కదూ? పోతంతకుండా పొట్ట పెట్టుకుని పైగా కరవొస్తున్నావు? నీతల బద్దల కొడతా ముండా!"

అంటూ తలుపుగొళ్లెట్టు చేతిలోవున్న చెంబుచ్చుకుని తలమీదకొట్టింది రావమ్మ, పీరమ్మని.

"నన్ను-కొ-ట్టకమ్మా, -అమ్మా-!......న-న్ను కొట్ట-కు-అది నా-తప్పుకాదు-మ్మా-కాలుజారిందమ్మా యింకాకొడుతున్నావా?-అయ్యో ....నానోయి! ఒరేయి.........అన్నయ్యోయి!"

"బాగా అచచ్చుముండా బాబుకోసం, అన్న కోసం అరు. గొంతుకపిసిలి చచ్చేలాగరు. లంజ ముండా! చూస్తూవుండండి. మీ ముగ్గుర్ని రేపు కాట్లోకిపంపిస్తా. నీవు నన్నెదిరిస్తున్నావు కదూ! నీకు ప్రాయిశ్చిత్తం చేస్తా" అంటూ ఆమె వంటింటి లోకిపోయి ఎర్రగాకాలిన గరిటె పట్టుకొచ్చింది వాత పెట్టటానికి.

"బాబోయి—నాకు వాతపెడతావా అమ్మా— అయ్యో నా కే-వాత-వేడుకుంటా-పెట్టకమ్మా-యింక రవను-నోరు మూసుకుంటా."

వెంకయ్య కేమిచేయటానికి తోచటంలేదు. లోపల దారుణకృత్యం జరుగుతోందని తెలుసు, కాని లోపలికి పోలేడు. ఎట్టకేలకు ధైర్యమూని లోపలికిపోయి చూచాడు. చూస్తే యేముంది? అవవలసినపని కాస్తా అప్పుడే పూర్తయింది. కూతురు పరికిణీ తొడపైకి లాగి, ఆగరిటె వాతపెట్టేసిందప్పుడే. ఆబాధ ఓర్వలేక, ఏడ్వటానికి శక్తిలేక నీరసంతో పడుందిపీరమ్మ. ఆదృశ్యం చూచాడు నిలువునా నీరైపోయాడు. చూస్తున్నా అర్థం కావటంలేదు వెంకయ్యకు. వెంకయ్యకు తెలియకుండగనే, "పిల్ల నేమిటి చేశావు" అనేమాటలు వెలువడ్డాయి.

"ఏమిచేశానా? యింక నీకు రాత్రి జోనుపడ లేనట్టుంది-తెగ పేల్తున్నావు-ఉష్ చాలించు నోరు" అంది గర్జిస్తూ.

పిల్లకైనా నాలుగుతలుపులువేసి కొడుతోంటే దానికి కూడా యెదురుతిరిగి గ్రుద్దుకోకే ధైర్యం వస్తుందిట. అంతధైర్యంవచ్చింది వెంకయ్యకు. "యిదిగో చాలిస్తా" నంటూ తలుపుచాటునున్న చేతికర్ర యెత్తాడు కొట్టటానికి.

యెత్తినచెయ్యి యెత్తినట్టే ఉండిపోయింది. చెయ్యియెవరో వెనుకపట్టుకున్నారు.

"నాన్నా, ఆగు, తొందరకూడదు. ఇది నువ్వు చేయవలసినపని కాదు. నలుగురూ చేరుతారు పూరుకో" అన్నాడు వెనుక కర్రపట్టుకున్నతను.

"నన్నువొదిలెయ్యి వొదులు, వొదలవేం" అని చేయి లాక్కో బోయాడు తండ్రి. కాని కొడుకు వదలలా.

"అబ్బ, కుర్రాడా. నన్నువదలరా. ఆ రాక్షసి ముండ అమ్మాయి నేమిచేసిందో నీకు తెలియదురా! తెలిస్తే నన్నుపట్టుకోవురా. నాకు పిచ్చెక్కుతోంది రా. వదిలెయ్యరా. దాన్నివ్వాళ హతమార్చాలి. వొదిలెయ్యి. నన్నువొదులు" అన్నాడు వెంకయ్య.

రావమ్మ భర్తకేసి పళ్ళుకొరుకుతూ, చెంగున వంటింట్లోకి పరుగెత్తి బ్రద్దలయేటట్లు తలుపులు కొడుతూ మూసింది. పెనుగులాడుతున్న తండ్రి కొడుకులు నుంచున్నవారు నుంచుండిపోయారు.

సుబ్బయ్య, తనచెల్లెలువద్దకుపోయి మృదుమధుర వాక్యాలతో పూరడించి లేవతీశాడు. చెల్లెలు మాట్లాడలా. మాట్లాడలేకపోయింది. ఇంకో వాతపెట్టటానికి మళ్ళీ తల్లొచ్చిందేమోననుకొని, మాట్లాడలేక వెర్రిచూపులుచూడటం మొదలుపెట్టింది అన్నకేసి. ఆ చూపులుచూస్తుంటే అతనిగుండె నీరైపోయింది.

"అమ్మయేదనకు" అంటూ కళ్ళనీళ్ళు తుడిచాడు. "అవుతే అమ్మ నేమన్నావు. ఏమైనకష్టపెట్టావా?" అన్నాడు వాతకేసి వెర్రిచూపులు చూస్తూ.

"అన్నా-అమ్మని నేను కష్టపెట్టానని ఎల్లా అనుకున్నావు." అంది కళ్లనీరు కారుస్తూ.

"అమ్మాయీ, నీకే, నువ్వడిగావని మురుకులు చేయించుకొచ్చానమ్మా" అన్నాడు ముసిముసిగ నవ్వుతూ.

"మురుకులా—నిజంగా," అంటూ సంతోషం పట్టలేక హృదయపూర్వకంగా, తనకు క్రితంజరిగిన హృదయభారం తగ్గించుకోడానికి, తనసోదరుని గాఢాలింగనమొనర్చుకుంది.

"ఇంకా, తింటానికి మిఠాయికూడా తెచ్చా" అన్నాడు మెల్లిగా.

"మిఠాయి, మురుకులు!" అంటూ చిరునవ్వుతో ఆ పొట్లములను మనసార ముద్దిడుకుంది సంతోషంతో. ఈక్రొత్తమురుకులవల్ల గంటక్రితంజరిగిన బాధ మరిచింది.

వెంకయ్య, తనమోమును అరచేత వాన్చి తన బిడ్డల సంతోషకరమునైన సంభాషణలువింటూ, మాట్లాడకుండా ఆనందిస్తూ, చూస్తూ కూర్చున్నాడు. తన హృదయభారం తగ్గించి—తన భార్యవనుక నే తన హృదయభారముకూడ అదృశ్యమైంది.

3

మధ్యాహ్నం పన్నెండుగంటలయింది. ఫేక్టరీలో గంటవాయించారు. గంటచప్పుడు వినటంతోటే ఫేక్టరీలో పనిచేయు పనివాండ్రందరు తండోపతండాలుగా మధ్యాహ్నభోజనాలు చేయటానికి బయిటకొచ్చి, భోజనాలకే వేయబడిన తాటాకులగుడిసెలలో భోజనాలు చేయటం మొదలుపెట్టారు.

పనివాండ్రు మొత్తం రెండువందలమంది ఆ శాలలలో కూర్చొని భోజనాలుచేస్తున్నారు. కాని ఒక కుర్రవాడుమాత్రం, భోజనము చేయక, ఏమేమో ఆలోచిస్తూ, భోజనముచేయువారికేసి ఈర్ష్యాభావ దృష్టులుసారిస్తూ కూర్చున్నాడు. ఇంతట్లో ఒక అమ్మాయి, చినిగిన గానొకటి తొడుగుకుని, చేతితో పొడుగు కుండనొకదానిని చినుగులగుడ్డలోకట్టి అతి తొందరగా, ఒగర్చుకుంటూ వచ్చింది. ఆబాలికను చూచుసరికి అతని ముఖవికాసము, ఆతురితపూరితమై వికారమునకు మారింది.

"కారణమేమిటి పీరా?" అన్నాడు ఆతురతలో, "నీకళ్లు యేమంత యెర్రగనున్నాయి. ఏడ్చినట్టు కనిపిస్తున్నావు. ఇంకా—" అంటూ చేతులకేసి చూచి "నీమురుకులేవి?" అన్నాడు.

"అమ్మ బద్దలకొట్టింది" అంది దీనస్వరంతో.

"అమ్మ బద్దలకొట్టుట యేమిటి? సవిస్తరంగా చెప్పు" అన్నాడు ఆతుర్తతో.

"అమ్మ చెప్పిందిగదా; నాన్నదబ్బంతా తగలబెడుతున్నాట్ట. నీజీతంఅంతా యెప్పుడు ఆమె చేతులలో పెట్టటంలేదుట. నీడబ్బంతా నామురుకులకని, తినుబండారాలకని ఖర్చుపెడుతున్నావట. అంటూ నామీదకు వచ్చి, 'మింగ మెతుకు లేదు, మీసాలకు సంపెగనూనె. నీ మోహానికి మురుకులుకూడానా? ఓసి భోగందానికూతురా' అంటూ రెండుచేతులు పట్టుకొని పట్టుమనివిరిచింది" అంటూ విచారముతో మాటరాక ఆగుతూ, ఆగుతూ చెప్పింది.

చెల్లెలు చెప్పినమాటలు విని చెల్లెలు హస్తములు తనచేతియందుంచుకొని చేతులను తదేకదృష్టితో పరికిస్తూ కంట తడిపెడుతూ "అయ్యో తల్లీ, నీవు భోగందాని కూతురువా?" అంటూ పోతునయేడ్చి "అయ్యో, అతివాడాకుగనుండు నీవేళ్ళు ఇంటి పనులవల్ల యెంత మొద్దక్కినవే తల్లీ! అబ్బ, నీచేతి నుండు మురుకుల నింత బలవంతముగ లాగి విరచుటకు ఆమెకు చేతులెట్లాడెనే తల్లీ! ఎంత మోటతనము చేసిందే! చేయిదూంతరయు కత్తితోటి కోసినట్టు కోసుకుపోయి నెత్తురు కాలవలుకట్టుచున్న, నీ మృదుహస్తాలను చూచిరాయైన ఆమెగుండె కరుగలేదమ్మా! నీచేతులు చూచుటకు దుస్సహముగనున్నదే తల్లీ. ఎంతకఠినహృదయ—నీకు వాతలెట్టుటకు ఆమె కొంచెమైన సందేహింపనైనలేదే. అయ్యో— గొడ్డుకు వాతలుపెట్టుటకే వెనుతీయుచుందురు. అట్టి తరి నీకోమల శరీరముమీద వాతలెట్లు పెట్టగల్గెనే! అబ్బ దుర్భరము-దుస్సహము- సైపహింపలేనే తల్లీ" అంటూ పళ్ళు పటపటకొరుకుతూ చటుక్కునలేచి

మందున్నాడు. కాశేపట్లు నంచోని, కళ్ళనీరు తుడుచుకొని, కొంతవరకు ఆత్మశాంతి చేసుకొని మనసారా-హృదయపూర్వకంగా, తన చెల్లెల్ని గాఢాలింగనమొనర్చుకొని ముద్దులవర్షము కురిపించాడు.

ఫేక్టరీలో గంట గణగణమంది. ఆగంట యితనికి వినబళ్ళా. తక్కిన పనివాళ్ళు వెడుతూ యితన్ని వింతగా చూచారు కాని ఇతను వాళ్ళని చూడలా.

"ఇక ముందైనా దీనిని ఆమె పొట్టను పెట్టుకు తీరుతుంది. ఇప్పుడే పెట్టుకున్నా. దైవశాత్తు బతికింది కాని-కానీలే-నేనే ఆమెబుర్ర బద్దలకొట్టి నరకంలోకి పంపుతా" అంటూ ఆదగ్గరవున్న కర్రలగుట్టలోంచి పెద్దకర్రనొకటి చేతనిడుకొని, చురచుర పిచ్చివానివలె తైటకు వెళ్ళాడు.

ఈమె అతని ప్రవర్తనకు భయభ్రాంతురాలై నుంచుండిపోయింది. అన్నను వెనక్కు పిలువబోయింది కాని మాటరాలా...పదినిమషములైంది. పక్కసందునుంచి మోటార్లురెండు డీకొనినచప్పుడు. జనులడావిడి- విచారసూచికమైన కేకలు- మొదలయినవి వినిపించాయి. ఆకేకలు, ఆ హడావిడి బట్టిచూస్తే ఒక దారుణకృత్యం జరిగినట్లు కనిపిస్తుంది.

౪

ఆరోజు సాయంత్రం లోకల్ పేపర్లు క్రింది విధంగా ప్రకటించాయి.

కారుప్రమాదము

యువకుని ఆకస్మిక మరణము

ఈరోజు మధ్యాహ్నము పద్దెనిమిదేండ్ల యువకుడొకడు, ఐస్‌హౌస్ నకు పోవురోడ్డుపై, రెండు కార్లు డీకొనుటచే మరణించెను. ఆశవము రాధాకృష్ణా ఫేక్టరీలో పనిచేయు సుబ్బయ్య అని గుర్తింపబడింది. అతనికి తల్లిదండ్రులున్నారు. అతని చేతియందు పెద్దకర్రనొకటి వున్నది.

ఒకవిలేఖరి.

ఈవిషయము వెంకయ్యకు తెలిసింది. కొడుకు ఆకస్మికమరణవార్త వినగనే తండ్రి మూర్ఛపోయినాడు. వీరమ్మ పిచ్చియెత్తిన దానివలె నుంచున్న పళంగా యిల్లువదలి అదృశ్యమైంది.

వెంకయ్యకు మాటలేదు- శ్వాసలేదు- కూర్పులేదు. ఇరుగుపొరుగువారంతావచ్చి వెంకయ్యను ఓదార్చారు. వెంకయ్యకొంతసేపటికి కళ్ళుతెరచి "అయ్యో! రాక్షసీ, నీవు నాబిడ్డల వెంతకష్టపెట్టావు. నీవుపెట్టు కష్టములను సహించలేకపోయాడే! ఇప్పుడుకదా నీకు మనశ్శాంతి కలిగింది. అయ్యో! కుర్రా, నీకింత దారుణమృత్యువుకలిగిందిరా. ఆచావు ఈరాక్షసికేనా పెట్టాడుకాదురా పాపిష్టి దేవుడు. నాకు నావీరమ్మనేనా కళ్లారా చూపించండి బాబూ" అని హోరు హోరున ఏడవటం మొదలెట్టాడు-ప్రక్కనున్నవారు ఓదార్చారు.

"తగిలిన వేలంకే తగులుతుంది" అన్నట్లు తన అన్న మరణము విన్నతక్షణం, తనకీ ఈలోకములో యిక తావులేదనుకుని, తను యిక బ్రతుకుట దుర్లభమని, తన ప్రాణమైనవస్తువు దాటిపోయిందని విచారించి యిక విచారము పట్టలేక ఆప్రక్కన శివాలయములోనున్న కోలనులో పడి ప్రాణములు బాసింది వీరమ్మ. మర్నాడు శవము తేలగా బయటకులాగారు పురజనులు.

ఈదారుణవార్త వెంకయ్యకు తెలిసింది. నుంచున్నపళంగా పిచ్చెక్కింది వెంకయ్యకు. ఆపిచ్చిలో తనుకూడ యిల్లువదలి వీధులవెంబడి పిచ్చివానివలె వచ్చిపోవువారిమీద రాళ్ళురువ్వడము—కొట్లమీద గుడ్డలుచింపి, సరుకులు గిరవాటేసినప్పుడు—తిన్న చోట్ల తిట్లు, పడ్డచోట్ల దెబ్బలు పడుతూ యిప్పటికీ తిరుగుతూనే వున్నాడు వెంకయ్య.

ఆహా, పుత్రశోకమున ఎంతవారికైనను పిచ్చ కలుగును గదా లోకంలో!

౫

రావమ్మ, రామారావుపేటవదలి వెళ్ళిపోయింది. పురజనులంతా వెల్లూరు పుట్టింటి కెళ్ళినదనుకున్నారు.

సంవత్సరము దాటింది. ఆమె జాడలేమి తెలియలేదు. ఒకరోజున ఎగ్మూరు మేజిస్ట్రేటుకోర్టుకు పోలీసులచే, చేతులకు సంకెళ్ళు వేయబడి కొనిరాబడింది రావమ్మ. తీర్థప్రజల్లాగ ఆవ్యక్తిని చూడ్డానికెళ్లారు ప్రజలు.

రావమ్మను పోలీసులు పట్టుకుందురను భయమున యిల్లువదలి మారువేషము వేసుకొని పారిపోయింది. సంవత్సరమునుంచి ఆమెకోసం వెతుకుతునే వున్నారు పోలీసులు. ఆఖరికి ఆమెను ఒకగుడిసెలో పట్టుకు తీసుకువచ్చారు.

ఆగుడిసెలో ఆయిద్దరు పోలీసులకు ఆమెకు యుద్ధము జరిగింది. ఆయుద్ధంలో ఆమెకు చిన్న చిన్న దెబ్బలు తగిలినా, ఆయిద్దరి పోలీసులలోను వొకణ్ణి హతమార్చింది. ఈ గలభా అంతావిని యిరుగుపొరుగువారువచ్చి రావమ్మను విరిచికట్టి ఆ రెండోపోలీసు కప్పుచెప్పారు గాని, వీరు రాకుండావుంటే ఆ రెండవపోలీసును కూడ చంపేసేదే. ఆ మేజిస్ట్రేటు రావమ్మను హైకోర్టులో విచారించమని హైకిపంపాడు. హైకోర్టులో రావమ్మకు వురిశిక్ష వేశారు.

---

## తాజమహాలు

శ్రీమతి రాజేశ్వరిగారు

ఎడబాటు ఘటిల్లిన యీ
యెడదలేవో నేలగలసి—
పువురాలుటఁజెల్వు తోడిమె
పోలిక నిది నిలచెన్ !

ఈ జాబిలి రాలనుండి
షాజహాను కాబోలును
ప్రతినిశి స్రవియించు మృత
ప్రణయమూర్తి కొరకై !

ఈ సన్నిధిఁ గాలంబే
యొసరిల్లి నిల్చినదే
మో ! నాయెడదకుఁ దోచెడి
నే నాఁటిదో ప్రేమస్ఫూర్తి !

ఈ విశాల విశ్వంబున
కీ వియోగ శిల్పగీతి
యొకటెచాలుఁ బ్రేమగతికి
ముకురంబును జూపన్.




కోడేరు,
12–9–33.

## పల్లెటూళ్ల స్త్రీలు—దినచర్య.

సౌ॥ అక్క సీతాలక్ష్మమ్మగారికి చెల్లెలు శ్యామల అనేక నమస్కారములు, తరువాత.

అక్కా,

ఇక్కడి విశేషములు తెలుపుమని నీవు ప్రతి యుత్తరమునందును నొక్కి వ్రాయుచుందువు. పుట్టిన యూరియందుగల అభిమానము కొలది నీవట్లు తెలుసుకొన గోరుచుందువేగాని ఈ కుగ్రామమున నెప్పటి కప్పుడేమి విశేషములు కలుగుచుండగలవు? మన యూరికాపురములు నీ వెఱుగనివి కావు. ఏయింటి యిల్లాలిని చూచినను చేసినపని కించి త్తగపడకుండినను ఒక్క రవ్వ తీరుబాటులేక పని తెమలక యీడుపోతలు పడుచునే యుండును. తెల్లవారగట్ల మూడు గంటలకులేచి రాత్రి పదిగంటలవరకు తన్నుకొనుచున్నను పనులు తెమలవను బెంగ తప్ప వాటికి వేరొక యాందోళన ముండదు. ప్రొద్దున్న లేవడము, ప్రాచిపనులు చేయడము, ఉన్నదీ లేనిదీ చూచుకోవడము, అప్పుసప్పు తెచ్చుకోవడము, పెద్దచెరువు కెళ్లి బట్టలుతుకుకొని చెంబులు బిందెలు తోముకొని స్నానాలు చేసుకొని నీళ్లు మోసుకోవడము, వండి వార్చుకోవడము, దేముని దగ్గర దీపము వత్తి పెట్టుకోవడము, మగవాళ్లకు వడ్డించి తాము రెండు మెతుకులుతిని చేతులు కడుగుకొనేటప్పటికి పొద్దు వాలిపోవును గదా! అప్పటినుంచి మళ్లీ రాత్రివంట ప్రయత్నముచేస్తూవుంటే రాత్రి పదిగంటలకు తెమలగలరు. వెంకమ్మత్త లాంటివాళ్లయితే యీ మధ్యకాలములో కాస్త పెత్తనాలు బూని వారింటి కబుర్లు వీరింటికి, వీరింటి రహస్యాలు వారింటికి వార్తాపత్రికలాగ మోసి జుట్లు ముడిపెట్టి దెబ్బలాటలు పెంచగలరు; అది చేతకాని సత్యకాలము వారైనచో పేరూ ప్రతిష్ఠా లేక తమ యింటి నాలుగుగోడల మధ్యను పడియుందురు.

ఈలోపుల అలికినచోట అలుకుటా, చిలికినచోట చిలుకుటా, అనుమానపడి మునుగుటా, మడిబట్ట మైలపడి తడిగుడ్డతో నానుటా, ఈ కారణముల చే పొయ్యి యూరకమండి కట్టెలు కాలిపోవుటా, అన-

ము చిమిడిపోయిన మగవారు తిట్టుటా, పిలిస్తే పలకక పిల్లలు పారిపోవుటా, వడ్డన లాలస్యమైన పిల్లలేడ్చుటా, ఈ చీకాకు భరించలేక మగవారు కేకలు వేయుటా, ఆ భయముచే తొందరలో నూనెగిన్నెలు నేతిగిన్నెలు ఒలికిపోవుటా, వేడివేడి తప్పేలాలు తగిలి చేతులు కాలిపోవుటా?, ఏయిల్లు చూచినను రణగుణధ్వనులతో నిండియుండును! ఇవన్నియు దాటి రెండు మెతుకులు తిని చేతులుకడుక్కొని వేడలుపెట్టుకొని ఒకగడియ విశ్రమింపగల యిల్లాలిని మహావీరశిఖామణియని గొనియాడవలసినదే గదా!

పాప మింతటి పనియుంతురాంధ్ర యింటి బిడ్డలకు తలలకు చమురురాసి దువ్వుట, ఒంటికి నీళ్లుపోసి తోముట, బట్టలు తెలుపుచేసి కట్టించుట మొదలగు భాగ్యము లెట్లు కలుగును? వాళ్లంతటవాళ్లకు చెఱువులకు పోయి తెప్పతెప్పున కొట్టుకొని యీతలాడి అల్లరిచేసే వయస్సు వచ్చేవరకు కళ్లపుసులతోను పాసిచోరికలతోను చీమిడికారు ముక్కులతోను జడలుకట్టుచున్న యెఱ్ఱని జుట్టులతోను బండమొలలతోను వీధులవెంబడి తిరుగుచుండవలసినదే గదా! కొంచెము అల్లరిచేసే వయస్సు వచ్చినప్పటినుండి జనకంటకము తప్పదు. తల్లి దండ్రుల పుణ్యము కొద్దీ బిడ్డలను ప్రసాదించిన పరమేశ్వరుడూ, ఎండా, గాలీ, దుమ్మూ, దూళీ మొదలగునవి ప్రపంచములో సమృద్ధిగానున్నన్నాళ్లు వాళ్లనుగూర్చి గమనింపవలసిన బాధ్యత తల్లులకు లేనట్లుగానే తోచుచున్నది. వీరికి వారమునకో పక్షమునకో ఒకదినమున కాని పండుగపర్వమునాడు కాని ముంతెడునీళ్లు పోయవలెనన్న ఇన్నాళ్లవంతు చమురు, పిండి, కుంకుడుకాయలు మొదలగునవి ఆ వేళ తీసివచ్చుటయేకాక అదిన మొక విశ్వప్రయత్నమైయుండక మానదు. తక్కిన దినములలో బడికిపోయినను సరే పల్లెకుపోయినను సరే పెద్దలువచ్చినను సరే బందుగులు వచ్చిననూసరే వారు మామూలువేషముతోనే యుందురు. పిల్లలెంత కుళ్లుగానున్న, వారి తల్లులు వారిని శుభ్రముగా చేయుటకైనను తీరుబాటులేని అంత మహాపనిమంతురాండ్రగు ఇల్లాండ్రుగా మనము పరిగణింపవలసినదే. ఇంతకంటె గొప్పవింతలు నీకేమి కావలెను!

ఈమధ్యను వినాయకచతుర్థినాడు భీమవరమునుండి సూర్యనారాయణ రావుగారు, నరసింహాచారిగారు, కృష్ణమూర్తిశాస్త్రిలుగారు మనవూరు వచ్చి గణపతిపూజలును, భోజనములును నైనతరువాత సత్రాజితీ పరిణయము మొదలగు కథలను పురాణము చదివి అర్థమును చెప్పిరి. చతుర్వర్ణములును, హరిజనులునుకూడ వచ్చి వారివారికి యథోచితమగు స్థానములను కూర్చొని యాలకించిరి. హరిజనులుకూడ ఇట్టి పురాణశ్రవణములకు వచ్చుచుండుటయు, వచ్చినప్పుడు బ్రాహ్మణులు కేకలువేయకుండ ఊరుకొనుటయు గాంధిమహాత్ముని ఉపవాసానంతరమునుండియు జరుగుచున్న క్రొత్త వింతయని నీకు తెలిసిన విషయమే. ఇట్టి

మార్పునకు అధ్యయనసంపన్నులయిన అవధాన్లుగార్లయినను ఎట్లో సర్దుకొని ఊరుకొనుచున్నారు కాని బాగ లగు కొంద రాచారవంతురాండ్రు మాత్ర మూరెగిరిపోవుచున్నట్లు కేకలు వేయుచున్నారు. అయినను కాలచక్రభ్రమణమువలన కలుగుచుండు మార్పులు ఇంతమాత్రమున నిలిచిపోవు.

నాకు పురాణపఠనానంతరమున వారు ముప్వురును ఖద్దరు ఉద్యమము, దాని ఆవశ్యకతనుగూర్చి మరియొకసారి సుగ్రీవబొబ్బ పెట్టిరి. గ్రామములో ఉత్సాహముగల యువకులందరికి మరియొక్కమారు ఉలుకెత్తినది. అప్పటినుండియు ప్రాతరాట్నముల నటకలమీదినుండి తీయువారును, వాటికి మరమ్మత్తు చేయించువారును, క్రొత్తవానిని చేయించుకొనువారును, ఏకులుకొని వడకువారును అయి గ్రామమంతయు భ్రమరగీతములతో నిండుచున్నది. కాని ఆడవాళ్ల పనులు మాత్ర మెప్పటిరీతినె ఉన్నవి. పాపము! వారికి రాట్నములవైపు చూచుటకైనను తీరుబాటుండదు. అథవా యే పనిమంతురాలైనా వేగము తెమలి దానివద్ద కూర్చున్నను, పదిమంది యిరుగుపొరుగు అమ్మలక్కలును వచ్చి వేఱొక ప్రసంగమో, పాటో, పోట్లాటో లోనికి దింపి అక్కడతో దానికి స్వస్తి చెప్పింతురు. రాట్నమున్నవాళ్లందరికీ తీరుబాటున్నను తీరుబాటైనవాళ్లందరూ నడుకుతూవున్నను మన దేశములో నీపాటికెంతదారము తయారు కావలసినది! అయినను పరిమివారి సుందరమ్మగారు మాత్రము తాను కళ్లజోడుపెట్టుకొని వడికి నీ వీయూరనున్నప్పుడే బుడతలను చుట్టియుంచిన సేరున్నర సన్ననూలును వచ్చీపోవుచుండు పరాయిగ్రామముల దేశభక్తులకెల్ల మహావింతగా చూపించి మెప్పుగొనుచునేయున్నారు.

అక్కా, ఎన్ని చెప్పినను పురుషుల యుపన్యాసములు పురుషులవే, స్త్రీల యుపన్యాసములు స్త్రీలవే. మగవారే యుపన్యాసముల నిచ్చినను ఏదో మగవారికోసమే కాబోలు చెప్పుచున్నారని స్త్రీలు తరచుగా గమనించరు. పురాణములు చెప్పుచున్నప్పుడు మాత్రమే పుణ్య మెక్కడకు పారిపోవునోయన్న భయముచే అతిశ్రద్ధగ విని కథలన్నియు జ్ఞాపకముంచుకొందురు. లౌకిక ప్రసంగములు చెప్పవలసివచ్చినప్పుడు స్త్రీలకు స్త్రీలే చెప్పవలెను. స్త్రీసనాతన విద్యాలయమునకు రాజమహేంద్రవరము నుండి చందాలెత్తుటకై యీమధ్యను దువ్వూరు సుబ్బమ్మగారు ఇచ్చటికి వచ్చి యిచ్చిన యుపన్యాసము మనయూరి స్త్రీలకు బాగానచ్చినది. తన నిష్ఠకు నీమమునకు శుచికి శుభ్రతకు ఆచారమునకు వ్యవహారమునకు జపమునకు తపమునకు నెట్టి భంగమును కలుగకుండ వేగము వేగముగ తెమలి రాట్నము వడకుచు ఉపన్యాసములిచ్చుచు గ్రామముల కేగి చందాలు వసూలుచేసి వచ్చుచుండు ఆమెవద్ద వండుకొని తిని నూలు వడుకుకొనుటకు కాలములేదని యెవరు చెప్పఁగలరు? పిల్లల అపరిశుభ్రత,

తల్లుల చాదస్తము, కొంద రరిందాల పని లేని పెత్తనములు మొదలగువానినెల్ల ఖండించి కొంచెము శ్రద్ధ, చురుకుతనము, ఆసక్తి పెట్టి పనిచేసినచో స్త్రీల కెంత వ్యవధి చిక్కి యెన్ని చక్కని కార్యములు చేయ వచ్చునో ఉపన్యసించుటయేకాక, ఇంటింటికొకొక్కనాడు వెళ్లి వారివారి చాదస్తములకు హేళనలుచేసి సరిగా దిద్దివచ్చుచుండెడిది. ఈ వూరిలోనున్న అయిదారుదినములును పురుషులతోను స్త్రీలతోను సర్వ వర్ణములవారితోను తలలో నాలుకవలె చనువుగా వర్తించి వెళ్లిపోయినారు. అప్పటి నుంచి మాత్రము మనవూరిలో కొన్ని యిళ్లవాళ్లు ఒకరిమీద పోటీగా ఒకరు పనులు వేగముగా తెమల్చుకొని రాట్నముల దగ్గరచేరి దారముతీయుటలో పందెములు కట్టుకొనుచున్నారు. అప్పుడప్పు డట్టివారు వచ్చిపోవుచున్నచో ఎంతో మేలుగనుండును. ఇక్క డంతా క్షేమము. అక్కడి మీ క్షేమాధికములు వ్రాయవలెను. ఇతర విషయములను కొంచెము కాలములోగా తిరిగి వ్రాయుచున్నాను.

ఇట్లు,
ప్రియసోదరి,
శ్యామల.



# ఓ దేవి!

సహదేవ సూర్యప్రకాశరావుగారు

వేకువ తెలినవ్వుల సురభీకరించి
కావిసంజల కనోన్మదచ్ఛజీవితమ్ము
నాది, ఓ దేవి! నుసివాడి నవసిపోయి
రేకురేకెల్ల చీకయి ప్రిదిలిపోయి
మంటిపాలైనగాని నేమనగనేర్తు
నీపతీమళనిశ్వాసనియతికలన;
కాని నీ పదప్రాంతేందుఖండపీఠి
కాంతరమునుండి త్రోసివేయకుము,తూగి
వేగిపోదు, విషాదజీవితములోడి
నీపదాంకిత మైనది నిత్యమల్లె.
లేశమాత్రమ్మనోచుకోలేద నేను?
దాని నీతలదాల్చుకోనైన వలదు
నీచరణకు శేశయసీమ నిలువనిమ్ము;
అటనె జీవించిపోనిమ్ము అటనె అంత్య
గీతికాలాపనమ్ముతో గీటడంగ
నిమ్ము; అదెమాధురీరసామృతమునిజము.
నీవునా కేమియైన గానిమ్ముగాని
నీవుమాత్రము నారాగదేవివే-కి
శోరమసృణమయూఖరేఖారుసాంద్ర
నవనవోజ్వలతరళసౌందర్యమూర్తి
వే—పునీతమాధుర్యసంస్మృతివె—సుప్తి
గొనిన శూన్యధామాంతరమును కలార్ద్రి
విధివెలార్చు తారాప్రదీపికవె దేవి!



# ఆరోగ్యబోధిని

శిశుపోషణమునకై భగవంతుడు తల్లి స్తనములందే పాలను నిర్మించియున్నాడు. గనుక భగవన్నిర్మితమైన చనుపాలను మించినదిగాని దానికిబదులుగా నన్నివిధముల తృప్తిని గలిగించునదిగాని యింకొక పదార్థము లేదని అందరును ఒప్పుకొనవలసియున్నది. ఇందుకు తార్కాణముగా మొదట పాశ్చాత్యదేశములలోని స్త్రీలు నాగరికత హెచ్చినకొలదిని తమకు పుట్టినబిడ్డలకు స్తన్యపానము చేయక నిరాకరించినందున ఆవుపాలను పట్టుటకు మొదలిడిరి. పట్టణములలో ఆవుపాలు అందరికిని దొరుకుట దుర్లభమగుటచేతను, శాస్త్రజ్ఞాన మభివృద్ధియందుండుట చేతను కొందరు శాస్త్రజ్ఞులు తమదృష్టి నీవిషయమున మరల్చి విశ్వప్రయత్నములుసల్పి చనుపాలకు బదులుగా వాడదగిన కొన్ని కృత్రిమపాలను తయారుచేయఁగలిగిరి. ఇందులో మెచ్చదగిన విషయమేమనిన వారు తయారుచేసినపాలకును చనుపాలకును యినుమంతయు భేదము లేక రెండును ఒకచోటనుంచిన నేది భగవన్నిర్మితమో ఏది కృత్రిమమో తెలియఁజాలని స్థితికివచ్చి యీవిషయమున విజయముగాంచిరి. ఈకృత్రిమపాలు బజారులలో విరివిగా విక్రయమునకు లభ్యమగునప్పటికి పాశ్చాత్యస్త్రీలందరును తమకష్టములు గట్టెక్కినవే యని తలంచిరి. ఏలయనగా తమబిడ్డలకు స్తన్యము కుడిపి తమ చందమును ఆరోగ్యమును కోల్పోవనక్కర లేదు. ఆవుపాలకై దేవులాడనక్కరలేదు. శిశువుల నిమిత్తము పసిగాట్లుపడి ఆవులను పెంచనక్కరలేదు. కొంచెము డబ్బుకర్చుజేసి బజారులో దొరుకు కృత్రిమ పాలచే తమబిడ్డల పొట్టలునింపి క్షుద్బాధ విముక్తులనుజేసి తాము స్వేచ్ఛగా విహరించవచ్చునుగదా! అయితే వారియూహ లెంతవరకు కొనసాగినవో చూడవలసియున్నది. దేశమందలి శిశువులందరికి నీ కృత్రిమపాలనిచ్చుటకు మొదలిడిరి. ఇట్లు నాలుగైదు సంవత్సరములైనపిమ్మట శిశువుల మరణములు, రోగములు దేశమంతటను గాన్పించెను. నాలుగుసంవత్సరముల శిశువులు నడచుటకు శక్తిలేక ఎముకలు పెరుగక, దంతములురాక, పుష్టిగాని బరువుగాని లేక, చర్మము ముడుతలుపడి అతిదీనముగా తోచుచుండిరి. వందలకొలది శిశువులు ఆస్పత్రులకు సలహాలకు వచ్చుచుండిరి. ఈస్థితినిగాంచి శాస్త్రజ్ఞులు కారణమును వెదుకజొచ్చిరి. తాము తయారుచేసినపాలలో నేమి లోటువచ్చినది యని విమర్శనగావించిరి. చూడగా తమశాస్త్రజ్ఞానమంతయువినియోగించి తయారుచేసిన పాలయందు ఏమియు లోటులేదని రుజువైనది. చనుపాలలోనున్న ప్రతిపదార్థము, అంతియే పరిమాణములలో తమ కృత్రిమపాలయందును కనపడుచున్నది. రుచియందుగాని, చిక్కదనమందుగాని, బరువందుగాని మరేవిషయమునగూడ తమ కృత్రిమపాలకును చనుపాలకును భేదముకాన్పించలేదు. అయితే నీ రెండింటికి గుణభేదమును పరిశీలించినప్పుడు చనుపాలుత్రాగి పెరిగిన శిశువులు ఆరోగ్యవంతులుగా నున్నారు. కృత్రిమపాలు తల్లుల కృత్రిమస్వభావమును వెల్లడి చేసినవి. దీనికి కారణమేమని శాస్త్రజ్ఞులు తీవ్రముగ పరిశోధనలు గావించి భగవన్నిర్మితమైన చనుపాలయందు ఆరోగ్యమున కావశ్యకమైన యేవో విశేషపదార్థము లున్నవనియు వాటి రూపము స్వభావములు తెలియఁజాలకున్నామనియు, ఆపదార్థములే తాము తయారుచేసినపాలలో లోటుగానున్నవనియు ఒప్పుకొనియున్నారు. ఆపదార్థముల యొక్క గుణములనుమాత్రము కనుగొనిరి. ఈ పదార్థములకు

'విటమిన్సు' అని పేరు పెట్టిరి. ఇవి భగవన్నిర్మిత పదార్థములయందిమిడి యుండుటచేతను, అవి మనుష్యుని జ్ఞానమునకు మించియుండుట వలనను భగవంతుడు సర్వజ్ఞుడనియు మానవాతీతుడనియు నొప్పుకొని దోసిలొగ్గి జోహారులిడిరి. పైగా తల్లులు శిశువులకు స్తన్యమును కుడిపినచో నారోగ్యము చెడునను మాట నిజము కాదనియు, అందుకు రుజువు లేదనియు పైగా స్తనము కుడుపకుండినచో నారోగ్యము తప్పక చెడు ననియు చాటి చెప్పుచున్నారు. ఇంతటితో పాశ్చాత్య దేశమందలి నవనాగరిక స్త్రీలకు గర్వభంగమైనది. ఇక వేరుగతి లేక తిరిగి తమపిల్లలకు చనుపాలివ్వ మొదలిడిరి. ఇది న్యాయమే కదా? శిశువు పోషణమునకై భగవంతుడు నిర్మించిన పాలను యివ్వకుండినచో భగవంతుని యాజ్ఞను మీరినవారై పాపఫలితముగా తమ ముద్దుబిడ్డలను మృత్యువున కప్పగించిన వారలగు చున్నారు.

గాన శిశువులకు తగిన ఆహారము తల్లి చనుపాలేయని వేరే చెప్పనక్కరలేదు. అయితే అందఱుతల్లులును పాలనిచ్చుటకు సమర్థులుగా నున్నారాయని యడుగ వచ్చును. నిజమే. ఈ క్రిందిదోషములు తల్లివద్ద కనుపించినపుడు శిశువునకు పాలివ్వకూడదు.

(1) తల్లి క్షయ మొదలగు వ్యాధులచే బాధ పొందునప్పుడును

(2) టైఫాయిడ్ మొదలగుఅంటుజ్వరములు కలిగినప్పుడును.

(3) ఆమె రోగపీడితురాలై విస్తారముగా నిస్సత్తువగా నున్నప్పుడును.

(4) పాలిచ్చునంతనే ఆమెకు నడుమునొప్పి నిస్సత్తువ కలిగి మూర్ఛపోవుట సంభవించునప్పుడునూ మాత్రమే తల్లి శిశువునకు పాలివ్వకూడదు. తగినంత కారణము లేకయే తల్లి శిశువునకు పాలనివ్వకుండినయెడల భగవంతుని ఆగ్రహమునకు గుఱియై తాను చేసిన పాపకార్యమునకు శిక్ష ననుభవించును. కొందఱు తల్లులు తమబిడ్డలకు సరిపోవు నన్ని పాలు తమవద్ద లేవందురు. ఈ కారణమున దాదులచేతను ఇప్పించుటకును యితరపాలను పట్టుటకును ప్రయత్నింతురు. తల్లివద్దనున్న చనుపాలే మిక్కిలి శ్రేష్ఠములని తెలిసినపిదప యితరపాల నేలయివ్వవలెను? అదియుగాక నితరపాలను పట్టుటలో చాల చిక్కులున్నవి గనుక తల్లులు తమవద్దనున్న పాలనే వృద్ధిచేసుకొనుటకు ప్రయత్నించవలెను. తమవద్ద పాలుతగ్గియుండుటకు తామే బాధ్యులని యెఱుగవలెను. ఏలయనగా క్షీరవృద్ధికి భంగకరములగు నాహార విహారములందలి దోషములే పాలలేమికి కారణములు. కడుపు నిండ తినుటకన్నము లేక గంజినీళ్లు త్రాగి జీవనము చేయుచున్న బీదదాదులు ఆరోగ్యవంతులై తమబిడ్డలకు స్వేచ్ఛగా చాలినన్ని పాలను కుడుపుచూ పైగా నితర శిశువులకుకూడ నర్సయి చేయగలిగి యున్నారను సంగతి యందఱకు విశదమే. దీనికి కారణము వారి నిరాడంబర స్వేచ్ఛాజీవనమును, వారు త్రాగుచున్న గంజినీళ్లును అయియున్నవి. దినమంతయు కష్టపడుచు మంచిగాలి వెలుతురులలో విహరించుచుండుటచే తమయారోగ్యము మెచ్చదగినదిగా నున్నది. ఈ విషయమున భాగ్యవంతులును మధ్యతరగతి స్త్రీలును పాఠముల నేర్చుకొనవలసి యున్నది. వీరును బీద స్త్రీలను అనుకరించుచు నిరాడంబర స్వేచ్ఛాజీవనమును గడుపుచు గంజి మొదలగు ద్రవపదార్థములనే భుజించుచున్నయెడల తమవద్దపాలకు లోటుండదు. అయితే భాగ్యవంతులును మధ్యతరగతి స్త్రీలును చేయుచున్న తప్పులన్నియు నందఱికిని తెలిసినవే యగుటవలన వేరేచెప్పనక్కరలేదు. అయిన నీసందర్భమున కొన్నివిషయములు చెప్పకతప్పదు. ముందుగ వారికి మనోవ్యాకులత హెచ్చు. భాగ్యవంతులైన యెడల సోమరితనమును, కొందఱిలో ఘోషాపద్ధతియు నుండుటవలన నట్టివారు ఆరోగ్యవంతులుకాక ఎల్లప్పుడు వ్యాధిగ్రస్తులైయున్నారు. ఇట్టివారు పిల్లలనుగని ఎట్లు పెంచగలుగుదురు? మధ్యతరగతి వారలలో అనేకమంది కొంచమైనను విశ్రాంతిలేక మిక్కిలిగా కష్టపడుదురు. ఇందువలన వీరిఆరోగ్య

కేశములకు




కేసరి పోమేడ్



# BE A MASTER – NOT A SLAVE

బానిసీడుగ నుండుటను నీ వెప్పుడును అభిలషింపవు. నీయందేర్పడిన దౌర్బల్యమే నిన్ను అన్నివిధముల బానిసగ మార్చుచున్నది. జీవామృతమును సేవింతువేని యిదివరలో హరించిన బలమును తిరిగి చేకూర్చుకోగలవు. మీరువ కుండెడు బలము, ధీశక్తి నీ కలవడును. చక్కని వీర్యపటుత్వము, నరములకు పుష్టి, శౌర్యతేజము నీ సొమ్మై బానిసభావము తొలగి పోవును. మనుజునకు నిజమైన పురుషతేజము కలిగియుండవలెనన్నచో జీవామృతమే శరణ్యము.

## PANDIT D. GOPALACHARLU'S

# JEEVAMRUTHAM

**AVAILABLE AT ALL CHEMISTS**

•

## AYURVEDASRAMAM

**POST BOX 287**
**MADRAS**




S.A.SERVICE.

# మహాసూతికాభరణము.

(బాలింతలకు పరమౌషధము)

ఈఔషధము స్త్రీలు ప్రసవించినప్పుడు కలిగే అనేకవిధములగు సూతికావ్యాధులకు అమోఘముగాపనిచేయును. సూతికాజ్వరము, ఒళ్లునొప్పులు, తలనొప్పి, నిద్రలేమి, దప్పిక, తాపము, మొదలగులక్షణములు కలిగినప్పుడు, సన్నిపాతముబట్టి ప్రలాపముగలిగినప్పుడు ఉపయోగించిన అమోఘముగాపనిచేయును. గర్భాశయమునుండి మైల సరీగా ప్రవహించక కడుపునొప్పిగలిగి బాధపడునప్పుడు ప్రయోగించినయెడల, మైల వెడలగ్రక్కించి, గర్భాశయమును శుభ్రపరుచును. వాతమును పోగొట్టును. పిచికారి (Douche) మొదలైనవి అవసరము లేకుండా ఆర్తవమును ప్రవర్తింపజేయు మందు యిదియొక్కటే; ఇది బాలింతలపాలిటి పరమౌషధము.

ప్రశంసలు

౧

*M. R. Ry. G. Suryanarayana Garu, Overseer. Madugula writes:—*

**The medicine called 'Mahasutikabharanam sent by you did wonderful work for my wife after delivery'**

౨

మ. రా. రా. శ్రీ. డాక్టరు నరసింగరావుగారు, గవర్నమెంటు డిస్పెన్సరీ, బురజ:—

మీరు నాకు పంపిన 'మహాసూతికాభరణము' చాలా ఆశ్చర్యకరమైనగుణము నిచ్చినది.

౩

మ. రా. రా. శ్రీ. నారాయణం తాయనాచార్లుగారు నేటివ్ డాక్టరు, ఇంకొల్లు:—

"సూతికాభరణము సన్నిపాతరోగులకు వాడినాను. అపరిమితముగా పనిచేసి మీ కీర్తిని ఎక్కువగా చెప్పుకొనుచున్నారు.

ఇత్యాదులు ఇంకను కలవు.

**వెల తు 1 కి రు 30. వారంరోజులమందు రు 5.**

**ఆర్యరసాయనశాల,**

**ముక్త్యాల (కృష్ణా.)**

ము చేయుచున్నది. ఇక వీరి ఆహారమును పరిశీలింతము. వీరు తినెడు ఆహారము ముఖ్యముగా ఘనపదార్థమే. అనగా అన్నము, కూరలు, పచ్చళ్లు మొదలైనవి. అందు ద్రవపదార్థమును, పుష్టినిచ్చునదియు లేనేలేదు. ఈకారణమున పాలు చిక్కనైయుండును. బిడ్డకు జీర్ణముకావు. త్రాగిన మట్టుకైన చాలకయున్నవి. మనస్సును నిర్మలముగా నుంచుకొనవలెను. శరీరమునకు తగినంత వ్యాయామమును, విశ్రాంతియు కలిగియుండవలెను.

తల్లిదగ్గరపాలను వృద్ధిపరచుటకు సాధనములలో కొన్నిటిని యిచ్చుట పొందుపరచడ మయినది.

(1) బిడ్డకు 3 లేక 4 గంటలకొకసారి తల్లి రెండు ప్రక్కలను పాలను కుడుపవలెను. ఒకవైపు శిశువు పాలు త్రాగుచుండగా రెండవవైపు చేపువచ్చిన యెడల వాటిని గిన్నెలోనికి పితికిపట్టవచ్చును. అంతేకాని ఒకవైపుమాత్రమే కుడిపి యూరకుండ కూడదు. పాలు మిగిలిపోయినయెడల చేతితో 10నిమిషములు రుద్ది పాలను పూర్తిగా పిండివేయవలెను.

(2) ఘోషావిడిచి ప్రతిదినము ఆరుబయట కొంచెము వ్యాయామము పొందవలెను. మంచి గాలి వెలుతురు పొందవలెను.

(3) ప్రతిదినమును ఉదయముననే తల్లి చన్నీటి స్నానము చేయవలెను. స్నానము చేయునప్పుడు ఒక్కసారిగా చన్నీళ్లు ఒంటిమీద పోసుకొనగూడదు. మొదట వెచ్చనినీళ్లలో నిలుచుని చన్నీటిలో ముంచిన తడిగుడ్డతో మిగతా శరీరమును రుద్దవలెను. పిమ్మట చన్నీళ్లుమీదను పోసుకోవచ్చును.

(4) ప్రతిదినము తల్లికి కాలవిరేచనమగుచుండవలెను. కానియెడల ఉదయమున నిద్రలేవగానే ఒక గ్లాసునిండ చన్నీళ్లు త్రాగవలెను. పండ్లు తినవచ్చును. విరేచనసాధనము ప్రతిదినము కావలసి వచ్చినయెడల "కాస్కారాసెగ్రెడా లిక్విడ్" 5 లేక 10 చుక్కలు రోజునకు ముమ్మారు తీసుకోవచ్చును.

(5) తల్లి కావలసినంత నీరును త్రాగవలెను. అధమము 24 గంటలలోను ఆరెం రెండు శేర్లకు తక్కువ గాకుండ నీరును త్రాగవలెను. శిశువునకు పాలిచ్చినప్పుడెల్లను తల్లి ఒకగ్లాసు మంచినీళ్లను త్రాగుచుండిన మంచిది.

(6) దినమునకు రెండుసార్లు స్తనములను వేడినీళ్లు చన్నీళ్లతో కాపడము (Sponging) చేయవలెను. దీనికి మొదట ఒకపళ్లెములో వేడినీళ్లను, యింకొకపళ్లెములో మంచుతో సమానముగ చల్లని నీళ్లను యుంచి రెండింటిలోను రెండు (Lint) గుడ్డల నుంచుకొనవలెను. మొదట చన్నీళ్లగుడ్డతోనొత్తిన పిమ్మట వెంటనే వేడినీళ్లగుడ్డతో కాచవలెను. ఇట్లు తడవులేకుండా త్వరగా త్వరగా నొకదాని వెనుక నొకగుడ్డతో స్తనములను రెంటిని 10 నిమిషములకాలము కాపటచేసి, వెంటనే పొడిగుడ్డతో తుడిచి చేతితో స్తనమును మెల్లిగా వెలుపలినుండి చనుమొన వైపునకు రుద్దవలెను.

(7) తల్లి సులభముగా జీర్ణమగునట్టియు బలకరమగునట్టియు నాహారమును తీసుకొనవలెను. దినమునకు మూడుసారులు తినవచ్చును. ఆహారమందు కూరలు, నెయ్యి లేక వెన్న పండ్లు, పాలు దినమునకు 1 శేరునకు తక్కువకాకుండా నుండవలెను.

(8) తల్లి పగలు ఒకసారియు రాత్రి పరుండబోవునప్పుడును ఒక 'కప్పు' ఆవుపాలు త్రాగవచ్చును.

(9) తీరుబడి కాలములో తల్లి కొంచెము విశ్రాంతి తీసుకొనవలెను. కాళ్లు ఎత్తుగాను తల క్రిందకును యుంచి పండుకొనుట మంచిది.

(10) మనోవ్యాకులత, కోపము, విచారము క్షీరవృద్ధికి భంగకరములని తెలుసుకోవలెను.

పైని వివరించిన పదిసాధనములును ప్రతివారును ఆచరించవచ్చును. మన స్త్రీలు పాశ్చాత్యనాగరికతావలంబనము చేతను కాఫీ, టీలను త్రాగుట కలవాటుపడి ముప్పొద్దుల భోజనము చేయక సోమరులై కాలమును గడుపుచున్నారు. తరవాణియన్నము తినుట మోటుతనముగా తోచుచున్నది. సంసారులకును సామంతులకునుకూడ గొల్లమ్మిపోసిన సారరహితమయిన మజ్జిగనీళ్లే గతిఅయెను. ఇక తల్లులు తమ పిల్లలకు పాలుకుడిపి పోషించుటెట్లు! గనుక స్త్రీలు పాశ్చాత్యనాగరికతా వ్యామోహమును విడిచి మన పూర్వులు చూపిన మార్గములననుసరించి తమ యారోగ్యమును తమబిడ్డల యారోగ్యమును కాపాడుట తమ విధియైయున్నది.




## శారదా నికేతనము

శ్రీమతి బొడ్డుపిల్లి బాలాత్రిపురసుందరమ్మగారు

శారద యీవిద్యాలయమును నీవారసి బ్రోవుము కూరిమితోన్।
సారసాక్షీ నినుచేరికొలిచెదము, కోరినవిద్యలుమాకిమ్మా!॥ శా॥

నారదమునినుత, వారిజలోచన, ధీరాణీయటుకోరివిను।
భారతాంబ యీబాలికలను, కాపాడగనీదే భారముగా॥ శా॥

హిందీసంస్కృత ఆంధ్రభాషలను ఇందుననెలకొల్పితివమ్మా।
సందేహమేల సంగీతసాహిత్య లలితకళలనిర్మించితివి॥ శా॥

ఆంధ్రమాత! మామాంద్యముతొలగించి సాంద్రకరుణమముజూడమ్మా।
చంద్రవదన! నీసుందరరూపము, ఈమందిరమునగాంచెదమమ్మా॥ శా॥

జాతీయవిద్యల ఖ్యాతిగనిల్పిన మాతవునీవె మాయమ్మా।
పూతచరిత! సనాతనధర్మము, నాటి ప్రబోధమునల్పమ్మా॥ శా॥

ఎన్నరాని యీకన్యాలయమున కాయుర్భాగ్యము లిడుమమ్మా।
సన్నుతచరిత! ప్రసన్నవున్నవదంపతులకు జయమీవమ్మా॥ శా॥

గర్తపురంబున తిలకుపేటలో కీర్తివహించిన విధిరాణీ।
ఆర్యావని! బల్ చిత్రలేఖనల ప్రసిద్ధిగాంచి నుతికెక్కితివి॥ శా॥

అక్షరాలనీకున్న యీశుభలక్షణములు నిజమేనమ్మా।
దీక్షబూని మహాలక్ష్మి! మానసోల్లాసిని! మమురక్షించవమ్మా॥ శా॥

# హరిజనాభ్యుదయము

గోదావరి కృష్ణా నదుల వరదలవలన హరిజనులకు కలిగిన నష్టములను నివారించు నిమిత్తమై పశ్చిమ గోదావరిజిల్లా అస్పృశ్య సేవాసంఘమువారు పశ్చిమ గోదావరిజిల్లావారికి రు. 100 లును కృష్ణాజిల్లావారికి రు. 100 లును వెరసి రు. 200లును విరాళ మొసంగిరి.

◆ ◆ ◆

ఇంతవరకు ఆంధ్రరాష్ట్రీ అస్పృశ్యతా సేవా సంఘ కార్యదర్శిగనుండి పనిచేసిన శ్రీయుత మాగంటి బాపినీడుగారు రాజకీయోద్యమమునందు చేరదలచుకొన్న సంకల్పమును విడనాడి, సెంట్రలు బోర్డువారియొక్కయు ఇతరులయొక్కయు కోరిక ననుసరించి, మరికొంతకాలమువరకు ఆ సేవచేయ నిశ్చయించుకున్నట్లు ప్రకటించుచున్నారు.

◆ ◆ ◆

మదరాసు నగరమున పెరంబూరు అరుంధతీయ పురమున హరిజనుల కొక వసతిగృహము గలదు. శ్రీయుత అల్లాడి కృష్ణస్వామి అయ్యరుగారు ఆగస్టు 29వ తేదిని అచ్చట జరుగుచున్న హరిజనోద్యమమును మాడ జేగిరి. రావుసాహెబు యమ్. యల్. సి. గురుస్వామిగారు అచ్చట జరుగుచున్న వివిధకార్యములను తెలియజేయుచు ఉపన్యసించిరి. అందు 22 రు హరిజనబాలు రున్నారు. పాఠశాల నుండి వచ్చిన తరువాత వీరు అచ్చటనే నివసించుచు దైవప్రార్థనలు, వ్యాయామము, ఆటలు, పాటలలో కాలము పుచ్చుచుందురు. వీరికి మంచి శుచిత్వము నేర్పబడుచున్నది. శ్రీయుత వెంకటసుబ్బయ్యగారు ఆరోగ్యమునుగూర్చి బోధించుచుండుతు. శ్రీమతులు శాంతాదేవి, సుభద్రమ్మగార్లు స్త్రీలకు భక్తిగీతములు నేర్పుచుందురు. వీరు సంస్కృతభాషనుగూడ మిక్కిలి చక్కగా నుచ్చరించుటమాచి కృష్ణస్వామి అయ్యరుగారు మిగుల మెచ్చుకొనిరి. వీరి ఆటపాటలకు శుచిత్వమునకు మిక్కిలి ఆనందించిరి. ఒకతోళ్ల పరిశ్రమాలయమును కొత్త పద్ధతులమీద నెలకొల్పవలెనని అరుంధతీయులను వీరు హెచ్చరించిరి.

◆ ◆ ◆

మచిలీపట్టణమందలి హరిజనుల పేటలలో అవసరమైనచోటులనెల్ల నూతులు త్రవ్వించుటను పురపాలకసభలో తీర్మానించబడినది.

◆ ◆ ◆

లక్నోలో హరిజనులకు శుభ్రమగు ఇండ్లు కట్టించుటకు లక్నో మునిసిపాలిటీవారు రు. 25000లు మంజూరు చేసిరి.

◆ ◆ ◆

తూర్పుగోదావరిజిల్లా రాజోలుతాలూకా విశ్వేశ్వరాయపురం గ్రామములో అగస్టు 19వ తేదిని రంగూన్ ఆదిమాంధ్రసంఘ ప్రెసిడెంటు శ్రీయుత రాపాక వెంకటరెడ్డిగారి సోదరులు అర్జునకున్ను మీనాక్షీ యను కన్యకును కళ్యాణము జరిగినది. వీరు హరిజనులు. తెలగకులస్థులు. ముత్యాల నారాయణస్వామిగారు పౌరోహిత్యము చేసిరి. బ్రహ్మగీతములు పాడబడెను. సవర్ణులును అరుంధతీయులును సహపంక్తిభోజనము చేసిరి. శ్రీయుత నేలటూరి జగన్నాథంగారు హరికథాకాలక్షేపము చేసిరి.

◆ ◆ ◆

రాజమహేంద్రవరములో హరిజనగ్రంథమాల యొకటి స్థాపించబడినది. ప్రస్తుత మిందు అరుంధతి

అస్పృశ్యత అను రెండు గ్రంథములు ప్రకటింపబడినవి. మొదటిదాని వెల రు. 0-2-0లు. రెండవదాని వెల రు. 0-4-0లు. ఇందు ప్రకటింపబడు పుస్తకము వెల రు. 0-4-0లకు మించదు. ప్రవేశరుసుము రు. 0-2-0లు ఇచ్చి అందరు చందాదారులుగ చేరవలెనని శ్రీయుత కలగ సత్యనారాయణిగారు గుంటూరులో ప్రచారము చేయుచున్నారు. ఇందు ప్రకటించబడు గ్రంథములన్నియు హరిజనులచే రచింపబడినవై యుండును.

◆ ◆ ◆

ఆగ్రాలో జరిగిన హరిజనసభవారు దేవాలయప్రవేశము హరిజనులకు ఆర్థిక సౌకర్యములకంటెకూడ ఎక్కువ ప్రధానమని నిర్ణయించిరి. అవర్ణులకు దేవాలయప్రవేశాధికార మీయని దే ఆర్థిక సౌకర్యములను కూర్చినమాత్రమున సవర్ణులు వారి ఋణము తీర్చుకొన్నవారు కాజాలరని మహాత్ముడు చెప్పుచున్నాడు. అవర్ణులు కోరినను కోరకున్నను సవర్ణులే ఋణమును తీర్చవలసినవారే. భారతశాసనసభలలో పెట్టబడిన బిల్లులగతి యేమైననుసరే, ఇందుకు తగినప్రచారము దేశములో సదా జరుపుచుండవలసిన భారము హరిజనోద్యమాభిమానులందరిపై నున్నదనికూడ మహాత్ముడు చెప్పుచున్నాడు.

◆ ◆ *

చాటపల్లి అంగలూరు గ్రామములలోని శివవైష్ణవాలయములలోనికి హరిజనులను ధారాళముగ రానిచ్చుచున్నారు. ఇచ్చటి కమ్మవారు హరిజనులచే నీళ్లు తెప్పించుకొనుచు క్షౌరములు చేయించుకొనుచున్నారు.

◆ ◆ ◆

1933వ సంవత్సరము జానుమాసములో యీ దిగువ వివరింపబడిన రీతిని హరిజనోద్యమప్రచారము సలుపబడినట్లు ఆంధ్రరాష్ట్ర హరిజన సేవాసంఘ నివేదికవలన తెలియుచున్నది. ఈపనులు చాలా మట్టుకు మండల సంఘమువారలే చేసుకొనిరి.

## మతవిషయము

నెల్లూరుజిల్లా శంకరవరములో 300 రూపాయలు పెట్టి ఒక రామమందిరము హరిజనులకొరకు కట్టబడెను.

## విద్యావిషయము

భీమవరము హైస్కూలులో ఇద్దరు హరిజన విద్యార్థులకు రు. 26 లును, తూర్పు కృష్ణామండలములో ఇద్దరు విద్యార్థులకు రు. 31 లును, ఏలూరులో ఒకనికి రు. 41 లును వేతనము లీయబడెను.

◆ ◆ ◆

ఏలూరులో ముగ్గురు విద్యార్థులకు పుస్తకముల నిమిత్తము చేరి రు. 20లును, గుంటూరుజిల్లా బ్రాహ్మణకోడూరులో హరిజనవిద్యార్థుల భోజనగృహమునకు రు. 100 లును, తాళ్లపాలెము రామాశ్రమమునకు రు. 50 లును, బందరులో రెండు రాత్రిపాఠశాలలకొరకు రు. 21 లును రాజమహేంద్రవరములో హరిజనక్లబ్బుకు రు. 21-4-0 లును, విద్యార్థుల పుస్తకముల నిమిత్తము రు. 15 లును, కాకినాడలో హరిజన భోజనగృహమునకు రు. 573 లును యీయబడెను.

◆ ◆ *

బారువ, తెనాలి, కుడిపూడి, అడ్డాడ గ్రామములలో రాత్రిపాఠశాలలు, ఏటుకూరు శ్రీకాకుళము గ్రామములలో గ్రంథాలయములు హరిజనులకొరకు స్థాపించబడెను. బళ్లారి, కర్నూలు, గుంటూరు, పశ్చిమ గోదావరి, పశ్చిమ కృష్ణాలలో హరిజన బాలబాలికలు సవర్ణపాఠశాలలలో చేర్చుకొనబడుచున్నారు. బళ్లారిలో హరిజనబాలికల కొరకు వసతిగృహమున్నది. అందు 9 గురు బాలికలున్నారు. వారికొరకు హరిజన స్త్రీ వంటచేసిపెట్టును. మునిసిపాలిటివారొక యిల్లు అద్దెలేకుండా యిచ్చిరి.

## ఆర్థికవిషయము

పిఠాపురములో 2000 మందికి, బాపట్లలో 700 మందికి, మంగళగిరిలో 1300 మందికి, త్రాంపూడిలో 3000 మందికి హరిజనులకు విందులు చేయ

బడెను. కనిగిరిలో రు. 13 ల కద్దరుబట్టలు పంచిపెట్టబడెను. ఇబ్రాంపూడిలో 50 మంది బిడ్డలకు, పామఱ్ఱులో 6 గురు బాలికలకు బట్టలీయబడినవి. నూజవీడులో 30 మంది బాలికలకు; 50 మంది బాలురకు బట్టలు, పలకలు పంచిపెట్టబడెను. బళ్లారిలో బాలబాలికల నిమిత్తము రు. 30లు ఇయ్యబడెను.

## వైద్యవిషయము

భీమవరము తాలూకాకు చెందిన ఉచిత హరిజన వైద్యశాలకు రు. 1000ల మందు లుచితముగనిత్తునని ఆయుర్వేద వైద్యవస్తాదు వెంకటస్వామిగారు వాగ్దానము చేసిరి. బళ్లారి, ఏలూరు మున్నగు పట్టణములలో ఉచిత వైద్యసహాయము చేయబడుచున్నది. తూర్పు కృష్ణామండల సంఘకార్యదర్శి వైద్యులగుటచే ఉచితముగ తామే హరిజనవైద్యము చేయుచున్నారు.

## ఇతర విషయములు

గుంటూరు, గంజాం మండలములలో మద్యపానము, మృతకళేబరభక్షణము మాపుటకు ఉపసంఘము లేర్పడి ప్రచారము చేయుచున్నవి.

◆ ◆ ◆

హరిజనుల హక్కులనుగూర్చి అన్ని మండలముల లోను 26 సభలు జరుపబడుటయేకాక బావులు, చెరువులు, పాఠశాలలు మొదలగునవి వారి యుపయోగమునకు తేబడినవి.

◆ ◆ ◆

పశ్చిమ గోదావరిజిల్లాలో తాడేపల్లిగూడెము తాలూకా హరిజనసభ శ్రీయుత దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారి అధ్యక్షత క్రింద 7-9-33 తేదిని జరిగినది. జిల్లానాయకు లెల్లరు నందు పాల్గొనిరి. తుంగ వెంకట్రామయ్యగారు మనోహరములగు పద్యములు చదివిరి. సభ నేర్పాటుచేసిన శ్రీయుత శనివారపు సుబ్బారావు గారిద్వారా తాలూకాబోర్డువారు 47 గ్రామముల లోని హరిజనుల స్థితిగతులను విచారణచేయించెను. వారు విచారణచేసి ఆయాగ్రామస్థులకు చేయవలసిన సహాయములనుగూర్చి చిత్తుతీర్మానములను వ్రాసిరి. అవి యెల్లయు సభలో ప్యాసుకాబడెను.

శంకర రామానుజ బసవేశ్వరాదుల తత్వముల చూచినను ఉపదేశముల వినినను చర్యలను బరికించి అస్పృశ్యత యనునది యెచ్చట కానరానట్లు పంతులుగారు తమ ఉపన్యాసములో చెప్పిరి. వారివలెనే యిప్పటి సంస్కారులును హరిజనాభ్యున్నతికి పాటుపడుచున్నారుగనుక సనాతనులు వారికితగిన సానుభూతి సహాయములను చూపవలెనవిరి. కారాగారమునుండి హరిజనసేవ చేయుటకువలయు సౌకర్యములను మహాత్ముడుకోరుట, ప్రభుత్వమువారు నిరాకరించుట, మహాత్ముడు ఉపవాసము, విడుదల మొదలగు వృత్తాంతములను విశదీకరించిరి. పిమ్మట నీదిగువ వాక్యములతో వారియుపన్యాసమును ముగించిరి.

"గవర్నమెంటువారి బాధ్యత మహాత్మునిజైలు నుండి విడచిపెట్టుటతో తప్పినది, కాని మనబాధ్యత అంత సులువుగా తప్పలేదన్న సంగతిని గ్రహింపకోరుచున్నాను. హరిజనోద్యమవ్యాప్తి తగినరీతిగా జరుగకపోయినచో, జరిగేవరకు ఆయన ఉపవాస దీక్షతో యజ్ఞము చేయును. అట్టియజ్ఞమునకే ఇపుడు ఆత్మయజ్ఞమని రుజువగుచుండెను. ఇదేరీతిని యొవరి మట్టుకువారు ఆత్మయజ్ఞమును చేసుకొనుచు మహాత్ములవారుచేయు యాత్మయజ్ఞమునకు తోడ్పడినచో అట్టిలోకోత్తరపురుషు ననుసరించి దేశాభ్యున్నతికి అన్నివిధాల తోడ్పడిన వారమగుదుము."

క్విలనుజిల్లాలలో పెరివాడులో హరిజనయువకులలో నొకనికి అడవులశాఖలోను ఒకనికి అబ్కారీశాఖలోను ఉద్యోగము లియ్యబడెను.

తిరువాన్కూరు పోలీసుశాఖవారు 15 మంది యువకులను కనిస్టేబులుగా చేర్చుకొనిరి.

కొచ్చిలో యిరింగలకూడలో కొందరు కంట్రాక్టరులు రాత్రిపాఠశాలవిద్యార్థులకే ఉద్యోగముల నిచ్చుట కంగీకరించిరి.

కొచ్చి హార్బరు వర్కుస్సులో హరిజనులకు పను లియ్యవలెనని ఎర్నాకులం ప్రచారకుడు కొచ్చిదివానును కోరెను.

నాగపూరు ఖాదీబండారువారు ఒక హరిజనునకు పని నిచ్చిరి.

నాగపూరులో ధరితోలీ స్వదేశవస్తు భండారువారొక హరిజనస్త్రీకి పనినిచ్చిరి.

# పెండ్లిముచ్చటలు

పశ్చిమ గోదావరిజిల్లా కృష్ణాయపాలెం అను గ్రామములో 35 సంవత్సరములు వయస్సుగల సంపన్న కమ్మకులస్థుడు పుట్టా సుబ్బన్నగారు 15 యేండ్ల వయస్సుగల మునెమ్మ యను వితంతువును వివాహమాడెను. పెండ్లి మంచి వైభవముగా జరిగెను. ఈ చుట్టుపట్ల గ్రామములలో నిటువంటి వివాహము జరుగుట కిదియే ప్రథమపర్యాయము.

బెజవాడలో లేడీ సబ్ అసిష్టాంటు సర్జనుగా నున్న మిస్. మేరీ చిరంజీవమ్మ అను క్రైస్తవ యువతిని పండిత కె. జ్ఞానిగారు ఆర్యసమాజ మతములోనికి శుద్ధిచేసి తీసుకొనివచ్చి లోకలుఫండు ఓవరుసీయరుగానున్న శ్రీయుత వి. డి. శేషగిరిరావుగారి కిచ్చి వివాహమొనరించిరి.

30-8-33 తేదిని శ్రీయుత దుర్వాసుల పార్వతీశంగారి కుమార్తె శ్రీమతి వెంకటరత్నమ్మగారను 18 యేండ్ల బాలవితంతువును కాకినాడ మహిళా సంస్కృత విద్యాలయాంగ్లాధ్యాపకులు శ్రీయుత మంచికంటి రాజారావుగారి కిచ్చి వేదోక్తముగా వివాహమొనరించిరి. వధువునకు వివాహకాలమున రు 500ల నగ లుంచబడెను.

రాజంపేటదగ్గర జోనగిరిమీదనున్న శ్రీ లక్ష్మీనరసింహస్వాముల ఆలయమునందు 2-9-33 తేదిని చెరువుల మీనాక్షయ్య శెట్టిగారికి మునగలూరి నరసయ్య శెట్టిగారి కూతురు లక్ష్మీనరసమ్మ యను వితంతు నిచ్చి వివాహముచేసిరి. బంధువులందరు విచ్చేసిరి.

పోలవరం ఏజన్సీప్రాంతములలో ఎవ్వరికి తెలియకుండనే వివాహములు శారదా చట్టమునకు వ్యతిరేకముగ జరుగకుండా ఆపుటకై శ్రీయుత కె. వియ్యన్న పంతులుగారును మంత్రిప్రగడ [illegible] రాజారావుగారును ఒక శారదా కమిటీని స్థాపించిరి. అందు మొదటివా రధ్యక్షులుగాను - రెండవవారు కార్యదర్శిగాను ఎన్నుకొనబడిరి.

జి. ఆర్. పట్కారు అనువతను బొంబాయి నగరములో నొక కోటీశ్వరుడగు గవర్నమెంటు కంట్రాక్టరు పుత్రుడు. అతను ఇంజనీరింగు చదువుకొనుట కేగి మాంచెస్టరు నగరమున మిస్. జెస్సీ మెడ్లీ యను నొక కన్యను చూచెను. ఆమె నర్సుగా జీవించు ఒక సామాన్యకన్య. వారిరువురు నొకరి నొకరు మోహించుకొని వివాహమాడిరి. జాయింటు పార్లమెంటరీ కమిటీ మీటింగులకు హిందూమహాసభ తరపున ప్రతినిధిగా వెళ్లిన డాక్టరు మూంజీగారామెకు గంగాజలముతో ప్రోక్షించి కుంకుమబొట్టు పెట్టి హిందూత్వ మిప్పించిరి. కాని అతని తండ్రి మాత్ర మతనికి పైసా పంపలేదు. "నేను సుఖముగా నున్నాను. నా పెనిమిటిని సుఖపెట్ట గోరుచున్నాను. తక్కిన విషయములతో నాకు ప్రసక్తిలే"దని ఆమె చెప్పుచున్నది.

పశ్చిమ గోదావరిజిల్లా వేల్పూరు గ్రామపంచాయితీ యుపాధ్యక్షుడు కె. సూరయ్యగారి 11 సంవత్సరముల వయస్సుగల కుమారునికి పాలాని చిరంజీవిగారి 9 యేండ్ల వయస్సుగల కుమార్తె నిచ్చి 22-5-32 తేదిని వివాహము జరిపించిరనియు వి. వీరయ్యగారు పౌరోహిత్యము జరిపిరనియు మువ్వరి పైని జిల్లా శారదాసంఘము తరపున కె. సన్యాసిగారు కేసుచేసిరి. ముద్దాయిలు వివాహము 29-4-33 తేదిని జరిగినదనియు, కేసు సంవత్సరము తరువాత పెట్టిరి కనుక కాలదోషము పట్టినదనియు వాదన పెట్టుకొనిరి. జిల్లా మేజస్ట్రేటు రావుబహదూరు ఆర్. సుబ్బయ్య నాయుడుగారు వారివాదమే సత్యమని నిశ్చయపరచి, ఫిర్యాదీ ముద్దాయిలకు బాధ కలిగించు ఉద్దేశముతో ఈకేసు పెట్టెను కనుక ముగ్గురు ముద్దాయీలకు వరుసగా రు. 20లు, 10లు, రు. 5లు నష్టపరిహార మిచ్చుకొనవలెనని తీర్పు చెప్పిరి.

# బాలవిజ్ఞానశాఖ

## కాళ్ళగజ్జ

శ్రీమతి యేలేశ్వరపు వెంకటమహాలక్ష్మమ్మగారు

(పిల్లలు కాళ్లుపారచాపుకొని నాకాలుపడినదంటే నాకాలుపడినదని చేతులతో మోకాళ్లను తట్టుచు యీరీతిగా పాటపాడుదురు.)

కాళాగజ్జ—కంకాణమ్మ
వేగులచుక్క—వెలఁగమొగ్గ
మొగ్గకాదు—మోటికినీరు
నీరుకాదు—నిమ్మలవాయ
వాయకాదు—వావింటికూర
కూరగాదు—గుమ్మడిపష్టి
పష్టిగాదు—చామలమట్ట
మట్టగాదు—మామిడికొమ్మ
కొమ్మగాదు—కోమలవెన్న
వెన్నకాదు—తూములమన్ను
మన్నుకాదు—మెంతిడుచల్ల
చల్లగాదు.సంతలో—గడియారపుగోలుసు
కాలుదీసి, గట్టునపెట్టు—

## అట్లతద్ది

కృత్తివెంటి వెంకటసుబ్బారావుగారు ఎమ్. ఏ.

ఉఱుముల మెఱుపుల యుత్పాతలేగె,
కొఱమాలి వానలు గురియుటలాగె,
పెరటిపాదులుపూసె విరిసెచేమంతి,
మురిపెమ్ముగావిచ్చె ముద్దపూబంతి,
కలుపుమేతల నాలకసువులునిండ,
కలిగినంతసుఖంచి కర్షకుండుండ
నింటపుట్టినదూడ లీనమోపనుచు
పంటమోముగుచేల పల్మారుగనుచు
పండుగచుట్టాల పక్కాలతోడ
ఎండవానలచిత్త మెకసక్కెమాడ,
ఎడబాటుతగదంచు నెడనెడకొసరు
కడిఁదిబలములేక కరువలిముసురు
ఏడాదికొకపండు గిదియనిదాఁటి
బాడుచుసరిగట్టు మాలెతల్ బారి
ఛిన్నిచిన్నాటలు చెమ్మచెక్కలును,
కన్నెలపచ్చాకు కన్నమూతలును,
శరదిందుచంద్రికా సంతోషమెఱుగు
తఱిపల్లెలను జీవితములోనిమెఱుఁగు;
చెల్లాయిరమ్మ వచ్చెను చూడుభోగి
తల్లంటిపోసికో దబ్బునసేగి
కాకిబొడ్డు పక్కకవిరి గోరింట
పాకమ్మరుబ్బును పండుగోరంట,
మండదు, చుఱుకను మైనపుచుక్క
లొండువేడుకఁ బెట్టుమొక బంతిరెక్క,
మాయమ్మ చేయంటమానెనా, దొంగ!
కోయింతు చెవులుముక్కను నీకసంగ,
చాలమంచిద శూన్యకయనవ్రతమ్ము,
పూలదండలపాన్పు పొల్పుఫలితమ్ము,

గుమ్మడిపువ్వులు గోగుపూరుల్లి
కమ్మగమఱి పొట్లకాయపాలన్న
మమ్మదు తొలిజాము నందుభుజించి,
ఇమ్ము ముత్తైదుల కింపుగావించి

తుంటరుల్ పల్లేరు దూలగొండియలు
వెంటచల్లేరు చూవెళ్లకా బయలు
తెలవారుసరికెల్ల దిగునుమీబావ
మెలమెల్లచూపించు మీయక్క త్రోవ

పోమ్మాకుకొనతోడి బొట్టెలఁగలసి
రమ్ముయెయ్యెలూగ వారలఁ బిల్చియొలసి,
యెంతయెత్తేని ఊయేలఁబోసుభువు
దాంతిపై పెరవారి తలఁదన్నఁగలవు,

వెనుకముందేని నివ్వెఱలేనివెఱవు
కినుకలేకజయింతు క్రేణిపచ్చెఱువు,
పట్టణమ్ముల బాలబాలికలకిది
పట్టివెట్టిగఁదోచు వలదుమనకది,

ముఱికివాసనలును మొఱకుక్రోటనులు
నిఱుకుసందులువారి కిరవుమన్నవలు,
నవనాగరకత మనలనట్లానర్చె
జవసత్త్వములను నైజములవెలార్చె,

ప్రకృతిసుఖోల్లాస భాగ్యమ్ముపదలి
వికృతిసౌందర్య దుర్విభ్రమంబొదలి
తమయాటపాటల తగవెఱుంగకయు
సమయింతువెనుక టాచారముల్ సకియ,

తొలికోడికూత నిద్దురలేచుటరయ
తెలివియరోగమ్ము తేజమ్ముమెఱయ,
కేవలఖేలనకేరింతగాదు
భావిసంస్కృతిభార భావనమీదు,

త్రొక్కుడు బిళ్లచిందులు కూతలీలు
నెక్కాడులోకోక్తు లెటునేర్చినారు!
పసుపుకుంకుమ మీకు బాసటై మరగు
పసలేనినుసిపూత పౌడరుమెఱుఁగు

అవసరవిక్రమాయతి వెఱవకుము,
నవసికంది యనుక్రొన్నన కురవకము,
ఆటపాటల మర్వకది సతిశక్తి
సూటి బృహద్గారి చూపించురక్తి,

కలియుము చిననాటి కన్నియచెలుల
లలితగౌరిమె కల్ముల నిడుదోసిలుల,
తొందరపఱుగిడి దొంగలగనుట
యందరసాహసం బలవర్చుకొనుట

ముందుముందిలుదిద్దు మురువులువినుట
విందులుసంఘజీవితమున మనుట
ఇందిదియెఱుఁగకయే వెక్కిరింత
దందనచదువుచంద మిదొక్కవింత!

పిల్లలతల్లివై విద్యాలగూర్చు
చల్లనితల్లి విశాలాక్షి నేర్పు,
వాయనమంద నాప్యాయనమట్లు
వాయినచ్చుకయున్న వట్టిచప్పట్లు,

తొగరు పారాణిదిద్దుట చూడకాల
మొగరమ్ము చొత్తువా ముద్దియలీల,
దశమి భర్తల జయధ్వజసూచకమ్ము
వశము మీకేఁక దేవివలన జగమ్ము,

మాన్యఆంధ్రులకన్య మగనిచేమించు,
గణ్యప్రతిభయున్న ఖ్యాతిరాణించు,
ఆసుదానియదృష్ట మనెను సామెతలు
వేడెమాటెటు తద్దివేకు వామెతలు?

# సంపాదకీయములు

స్వాగతము:—

జాయింటుకమిటీయెదుట సాక్ష్యము చెప్పుటకై అఖిలభారతమహిళాసమాజము తరఫున లండనునగరమున కేగి పాశ్చాత్యదేశ సంచారముచేసి మరలివచ్చిన శ్రీమతి ముత్తులక్ష్మిరెడ్డిగారికి "గృహలక్ష్మి" హృదయపూర్వక స్వాగతమొసగుచున్నది. మదరాసు నగర స్త్రీలొసంగిన స్వాగతసందర్భమున నామె తనప్రయాణమునందు జరిగిన అనుభవములనెల్ల వివరించెను. సాక్ష్యము చెప్పుటకు వెళ్లిన స్త్రీలైనను ఒక్కసూత్రముపై నిలచి యేకముఖమున తమవాదమును తెలుపక ఒక్కొక్కరాష్ట్రము వారొక్కొక్క నివేదికను పెట్టినందుకు ఆమె వగచెను. జాయింటుపార్లమెంటరీకమిటీవారు వీరికితగిన యవకాశమీయలేదు. జూలై నాలుగవ తేదిని వీరి సాక్ష్యము తీసుకొందుమని చెప్పి, అట్లు తీసుకొనక, డై హార్డు సాక్ష్యములన్నియు ముగిసినవెనుక నెన్నడో తీసికొనిరట. ఇంతవరకు ముత్తులక్ష్మిరెడ్డిగారు వేచియుండ నొల్లక చికాగో నగరమున జూలై 16—22 తేదీలను జరిగిన అంతర్జాతీయ మహిళామహాసభ (ఇంటర్నేషనలు వుమన్సు కాంగ్రెసు)ను చూడబోయెను. పిమ్మట ఈమహిళామణుల సాక్ష్యమును జాయింటుకమిటీవారు తీసుకొనరనియు ఒక ఉపసంఘమువారు తీసుకొందురనియు నిర్ణయించిరట. శ్రీమతులు హమిదాలీ రాజకుమారీగార్లు దీని కంగీకరించనందువలన ఒకరాజీపద్ధతి కంగీకరించి యీయుపసంఘమువారును అసలుసంఘమువారును ఇరువురునుకలసి సాక్ష్యమును తీసుకొనిరి. ఇంతా తీసుకున్నందుకు ఫలితము కనిపించదు. సాంఘికపరిష్కారము మార్చబడదు. ఈ మాటచెప్పుట కింతమందిని లండనునగరమేల పిలిపించవలెనోయని ముత్తులక్ష్మిరెడ్డిగారాశ్చర్యమును తెలుపుచున్నారు. హిందూదేశమునకు డొమినియను స్టేటసు ఇచ్చుటను గూర్చి యేసంఘమును ఏప్రతినిధులతోను చర్చించలేదు. చర్చలన్నియు శాసనసభాస్థానములు మొదలగునవి యేజాతివారి కెన్ని యుండవలెను, న్యాయపోలీసు శాఖలను ప్రజాప్రతినిధులకు మార్చవలెనావద్దా, మొదలగు సమస్యలకొరకే జరిగెను.

లండనునగరముననేమి ఇతరదేశములలోనేమి గౌరవమెల్లయు అత్యధికమగుత్యాగము లొనరించి జెయిళ్లలో కష్టపడుచున్న మహాత్మాగాంధి మొదలు కాంగ్రెసునాయకులమెడలను కాంగ్రెసునందునే గలదుగాని ఈసాక్షి

బృందముపై లేదనియే ఆమె చెప్పుచున్నారు. వీరి నెవరు ప్రశ్నించినను గాంధిగారి ఆరోగ్యమునుగూర్చియే. గాంధిగారి దేశమునుండి వచ్చుచుండుటంబట్టియే వీరి కీమాత్రము గౌరవమైనను గలిగెను. కాని లేనియెడల వీరిని పలుకరించెడి వారుకూడ నుండకపోదురని చెప్పెను. ఇంగ్లాండు దేశములో హిందూదేశముపట్ల జరుపుచున్న ప్రతికూలప్రచారమునకు హద్దు లేదు. హిందూదేశములో ఆందోళనము చేయుచున్నది యేకొందరో మాత్రమేయనియు, ప్రజాసమూహము సంస్థానాధిపతులు విల్లింగ్డను పద్ధతులకు సంతోషించుచున్నారనియు ఉపన్యాసము లీయబడుచుండును. లాయిడు ప్రభువుగారే ఒక సభలో నిట్లుపన్యసించుచుండగా ముత్తులక్ష్మిరెడ్డిగారు వినుట తటస్థించి ఉపన్యాసానంతరము దానిని ఖడించుట కనుజ్ఞ కోరగా లాయిడుగారు ముసిముసినవ్వులునవ్వుతూ మాట్లాడుటకు వల్లకాదని చెప్పిరట. ఇక ప్రతిగ్రంథాలయమునందును స్టీమరు ప్రయాణికుల యొద్దను మేయోకన్యగారి గ్రంథములు వేనవేలుగలవు. ఊసుపోని మహానుభావుల కెల్లఱికి అదియే పురాణకాలక్షేపమై యున్నది గనుక హిందూదేశమునుగూర్చి పాశ్చాత్యదేశములలో నెట్టి యల్పభావములుండునో ఊహించుకొనుట సులభము. ముత్తులక్ష్మిరెడ్డిగారివంటి విద్యావతులను నాగరకులను చూచి హిందూదేశీయులని తెలుసుకొని ఆశ్చర్యపడనివారు లేరట. మన దేశాచార పద్ధతులను చూడక కొందఱును, చెడుగులనే చూచి కొందఱును, మంచివానినికూడ గ్రహించుకొనలేక కొందఱును, విలాసమునకు కొందఱును, వైరమునకు కొందఱును అక్రమమగు ప్రచారములు చేయుచుందురని వినినచే మనమనస్సు నొచ్చును. అట్టి చర్యలను చూచివచ్చిన శ్రీమతిగారి మనస్సెంత నొచ్చియుండవలెనో గదా! హిందూదేశమునకు సంపూర్ణమైన రాజకీయస్వాతంత్ర్యము రానిదే పాశ్చాత్యదేశములలో ఇట్టి దుష్ప్రచారములు కట్టవనియు, భారతీయులెల్లరు ఏకకట్టుగానిలచి స్వరాజ్యమునకై పోరాడి తెల్లపత్రమును దిద్దించవలెననియు ఆమె ప్రబోధించుచున్నారు. ఆమె సలహాలను భారతీయులెల్లరును ముఖ్యముగా భారతరమణీమణులందరును శిరసావహించుదురుగాక యని కోరుచున్నాము.

మహిళాసంఘమువారి నివేదిక:—

శ్వేతపత్ర మెవ్వరికికాని సంతృప్తికరముగా లేకుండుటయేగాక సర్వులకు నాశాభంగకరముగనే యున్నది. భారతమహిళామణులవిషయమున గూడనట్లే. అఖిలభారత రమణుల మూడు ప్రతినిధిసంఘములును తొలినుండియు యుక్తవయస్కులగు స్త్రీపురుషులెల్లరికి వోటుహక్కుండవలెనని కోరుచున్నవి. మొదటి కొన్నియెన్నికలనుమాత్రము గ్రూపుపద్ధతి నంగీకరించినవి. అట్లయినచో యుక్తవయస్కులగుస్త్రీలెల్లరికిఁగూడ వోటుహక్కుండెడిది. కాని యిట్టిహక్కు పురుషులకువలె స్త్రీలకుగూడ ప్రసాదింపఁబడలేదు. ఏకారణముచేతనైన నిట్టిహక్కును ప్రభుత్వ

మువారు ప్రసాదింప లేకపోయినప్పుడు మున్ముందైనను నట్టిహక్కు సంపాదించుకొనుటకు తగినమూలసూత్రము లిందిమిడియుండవలెనని యీసంఘములవారు కోరిరి. అదియు అంగీకరింపబడలేదు.

ఇవి రెండును సాధ్యముకాకపోయినప్పుడు తమయభివృద్ధికి సాధనములగు సంస్కరణములు శాసనసభలలో రచించబడుటకు తగినంత యెక్కువమంది స్త్రీలకైనను వోటుహక్కుండవలెనని వారుకోరిరి. సైమనుకమిషనువారు పురుషవోటర్లసంఖ్యలో సగముమంది స్త్రీవోటర్లుండవలెనని సూచించిరి. ఫ్రాంఛైజు కమిటీవారి సంఖ్యను 4½ వంతుకు తగ్గించిరి. శ్వేతపత్రము 7వ వంతుకు తగ్గించెను. కాని యిదియైనను నిజముగా అమలుజరుగు వేళ వచ్చునప్పుడు రాష్ట్రీయశాసనసభలలో 15వ వంతుకును అఖిలభారతశాసనసభలో 20వ వంతునకును మించకపోవచ్చును.

ఈ వోటింగు పద్ధతియైనను ఒక్కొక్కరాష్ట్రమున కొక్కొక్కరీతి నున్నదికాని అఖిలభారతదేశమునకు సమానమైన సూత్రము లవలంబింపఁబడలేదు. స్త్రీలు సాంఘికనియోజకవర్గములనుకాని ప్రత్యేకనియోజకవర్గములనుగాని యెన్నడును కోరకున్నను అవి దేశారిష్టకములనియు స్త్రీజనాభివృద్ధికరములగు శాసనములు ప్యాసగుటకు ప్రతిబంధకములనియు ఘోషిల్లుచున్నను అవికూడ ఇందుచేర్పఁబడియున్నవి. దీనిని బట్టిప్రతిస్త్రీయు సాంఘిక వోటుమీదతప్ప శాసనసభలలో ప్రవేశించుటకు వీలుండదు. ఇట్టి శాసనసభలలో దేశహితైషికములగు శాసనములు ప్యాసగుట యెంతకష్టమో ఊహించుకొనవచ్చును.

ఇక స్త్రీలకీయఁబడిన ప్రత్యేకస్థానములలోఁగూడ ఒకత్రోవయు తెన్నును కనిపించదు. కొన్నిరాష్ట్రముల స్త్రీలకిట్టి ప్రత్యేకస్థానములనేర్పాటు చేయలేదు. ఎక్కువ విద్యాభివృద్ధి నందియున్న రాష్ట్రములోని స్త్రీలకుతక్కువవిద్యాయోగ్యతను, తక్కువ విద్యగల రాష్ట్రములోని స్త్రీల కెక్కువ విద్యాయోగ్యతలును నిర్ణయింపఁ బడినవి. మోటారుపన్ను యోగ్యతలైనను ఒక్కమదరాసురాష్ట్రస్త్రీలకే యొసగబడినవికాని అన్యరాష్ట్రస్త్రీల కొసగఁబడలేదు. అఖిలభారతశాసనసభకు ఒకవిధమగు పరోక్షపుటెన్నికపద్ధతి సూచింపఁబడుటచేత యెక్కువయోగ్యతగల స్త్రీలనెన్నుకొనుట కాధారములే లేవు. స్టేటుకౌన్సిలులో స్త్రీలకుస్థానమే లేదు. ఆస్తినిబట్టి వోటుహక్కున కర్హతగల పురుషులభార్యలకును విధవలకును మాత్రమే వోటుహక్కొసగబడినదికాని విద్యను బట్టి అర్హతగలవారి భార్యలకును విధవలకును అట్టి వోటుహక్కీయబడలేదు.

దీనినిబట్టి బ్రిటిషు ప్రభుత్వమువారు భారతదేశపు నియోజకవర్గములలో స్త్రీపురుషసమానత్వసూత్రమునకు తావీయలేదనియు, సాధ్యమైనంత యెక్కువమంది స్త్రీలకు వోటుహక్కు కలుగు సూత్రముల నవలంబింపలేదనియు స్పష్టమగుచున్నది. ఇట్టి దోసగులను నివారణచేయుటకుగా ఈప్రతినిధి సంఘమువారుకొన్ని సూచనలను చేసియున్నారు. స్త్రీ

లనువారు స్త్రీలన్న కారణమున నెట్టి యోగ్యమైన స్థానమునకు గాని అనర్హులుగా చేయు విషమసూత్రములనెల్ల తొలగించుచు ఒక శాసనము చేయఁబడవలెను. సాధ్యమైనంత వరకు స్త్రీవోటర్ల సంఖ్యను హెచ్చించవలెను. అట్లు చేసినచో వారు తమకు వాంఛనీయులగు స్త్రీలనే కాక పురుషులనుగూడ నెక్కువ మందిని శాసనసభలకు పంపగలుగుదురు. ఇట్లుచేయవలెనన్న అక్షరాస్యలగు స్త్రీలెల్లరికి వోటుహక్కుండవలెను; పల్లెటూళ్ళలో చదువుకున్నవారిసంఖ్య చాల తక్కువగనుండును గనుక నగరవాసులై యుక్తవయస్కులగు స్త్రీలకెల్లరకు వోటుహక్కుండవలెను; మరియు ఇప్పుడు పల్లెలుగా పరిగణింపఁబడుచున్న అనేక గ్రామములు నగరసీమలుగా గ్రహింపవలెను. ఇట్లు చేయనిచో తగినస్త్రీలకుగాని తగినంతమందికి గాని వోటుహక్కు సిద్ధించదు. రాష్ట్రీయ శాసనసభలకును అఖిలభారతసభకును గూడ వోటర్లజాబితా వొక్కటేయై దానిని తయారు చేయుపద్ధతి చాలాసులభముచేయఁబడవలెను. పరాదృశనిబంధనలెల్ల పెట్టి జాయింటుకమిటీముందు భారతస్త్రీల వాంఛలను మిక్కిలి సహేతుకముగను, ధైర్యముగను తమనివేదికను ప్రకటించినందుకు వారి ప్రతినిధులెంతయు ప్రశంసనీయులు. మరియు ఈ మహిళారత్నములు తమకోరికలు నివేదించుటతో తమ కర్తవ్యము పూర్తియైనట్లు భావించక ఈకోరికలను ప్రభుత్వమువారు సఫలములుగా చేయుకున్నచో వారు చేయగల సహాకారమెల్లయు అనుపమానముగు అఖిలభారత దేశీయాందోళనము మాత్రమే యనియు దానిఫలిత మెట్లుగాపరిణమించునో యిప్పుడే సూచించుట సాధ్యముకాదనియు స్పష్టపరచిరి. పాలకుల సంకల్పములను మార్చియు, భారతనారీమణుల దీక్షను స్థిరపరచియు భారతదేశ సౌభాగ్యమును పరమేశ్వరుడు పోషించుగాక!

హిందూవితంతుభరణముల బిల్లు:—

హిందూవనితలలో కొన్నిజాతులవారు భర్తృమరణానంతరము నిరంతరవైధవ్యములో మడయవలెననుటొక్కటియే వారిదురదృష్టముకాదు. భర్తమరణానంతరము పురుషసంతానరహితయగు వితంతువునకు భర్తఆస్తిలో స్వప్రాప్తికి భరణము రావలసియుండునను విషయమునుగూర్చి యొకశాసనములేదు. ప్రస్తుత మవిభక్తకుటుంబములలో జ్ఞాతులు తమదయాధర్మభిక్ష మెంతయొసంగిన నంతే ఆ అనాధయువతికి గతియగుచున్నది. అది అత్యల్పముగనున్నదనుటకు "ముండభరణ"మని మనము తృణీకరణబుద్ధితో పలుకుచుండుసామెతయే నిదర్శనమై యున్నది. అది ఆమెవేఱుండి స్వతంత్రముగ రామా కృష్ణా యనుకొనుచు జీవించుట కేమాత్రమును చాలక అవిభక్తకుటుంబమువారి కూడిగము చేయుచు బట్టా పాతా కొనుక్కొనుటకు మాత్రము బొటాబొటిగా సరిపోవుచుండుట మనము చూచుచునే యున్నాము. అమెతరపున పుట్టింటివారు భాగ్యవంతులై బోలెడు సొమ్ము పెట్టుబడిపెట్టి దావా చేసినను న్యాయాధికారి తనధర్మబుద్ధితో పెట్టించెడు

భిక్షయేకాని భరణమింత యుండవలెనను శాసనమేమియును లేదు.

హిందూధర్మశాస్త్రము ప్రకారము సంక్రమించెడి వారసత్వసూత్రములకు వేనికిని భంగము కలుగకుండ ఇందువిషయమై కొన్ని సూత్రములను నిర్ణయించి శాసనముచేయవలెనని హరవిలాస శారదాగారొక బిల్లును అఖిలభారత శాసనసభలో సెప్టెంబరు 5 వ తేదిని ప్రతిపాదించిరి. అక్టింగు లామెంబరు సర్. బిపిన్ ఘోషుగారు బిల్లులోని కొన్ని లోపములనుచూపి, వితంతువులు పునర్వివాహముచేసుకొన్నచో భరణమునకు హక్కుండరాదని సవరింపవలెనని చెప్పుచు ప్రజాభిప్రాయముకొరకు పంపవలెననికోరెను. పూర్వాచారపరాయణుడగు రామకృష్ణ జాగారు కూడ బిల్లు ప్రజాభిప్రాయమునకు పంపవలెనను ప్రతిపాదనమును బలపరచెను. శ్రీయుతులు అమరనాధదత్తు, యస్. పి. సేన్. బ్రజకిశోరుగార్లు కూడ దీనినంగీకరించుచు మాటలాడిరి. భర్త యొకవేళ భార్య కేమియును చెందరాదని మరణశాసనములో వ్రాసినను అదిచెల్లరాదని శారదాగారి బిల్లులో ఒక వాక్యమున్నది.

ఈ బిల్లుసూత్రమును దీనిసర్క్యులేషను ప్రతిపాదనమునుగూడ ప్రతిఘటించిన భూపతిరాజు సీతారామరాజుగారిచర్య చాలమంది కపసవ్యముగ తోచుటలో ఆశ్చర్యము లేదు. భర్తయొక్క స్వార్జితములోకూడ భార్యకు పాలులేకుండ భర్త మరణశాసనము వ్రాసినచో ఈసూత్రము చెల్లవలసినదే నాయని రాజుగారు లీగలుదృష్టితో ప్రశ్నించిరి. పురుషుని వివాహ మాడుచున్నప్పుడే స్త్రీ అతని ఆస్తికి హక్కుదారురాలగుచున్నదనియు, అతను మరణించినంతమాత్రమున ఆమెకు జీవించగల అధికారము తొలగిపోదనియు, వితంతువుల జీవనమునుగూర్చి యిట్టి అల్పభావములను గలిగియుండుజాతి వృద్ధికి రానేరదనియు, బిల్లులోగల యీషల్లోపములను సెలెక్టు కమిటీలో సవరింపవచ్చుననియు సర్క్యులేషను ప్రతిపాదనమును ప్రతిఘటించుట గర్హ్యాచర్యయనియు శారదాగారు సరోషముగ ప్రత్యుత్తర మిచ్చిరి. బిల్లు ప్రజాభిప్రాయమునకు పంపఁబడును. వితంతువుల దురవస్థలుచూచి కఱుగగలజాలిగుండె కలవారెల్లరును, సనాతనులు కానిండు అధునాతనులుకానిండు, బిల్లున కనుకూలములగు మార్పులేవైన కావలసినచో సూచించుచు బిల్లును సమర్థించవలెనని కోరుచున్నాము.

వావిళ్ళవారికిసమ్మానము:—

కీర్తిశేషులగు వావిళ్ళ రామస్వామిశాస్త్రులుగారు వారి జీవితకాలములో నొనరించినట్టియు, వారు పరమపదమును పొందినప్పటి నుండియు వారి పుత్రులు శ్రీయుతులు వెంకటేశ్వర శాస్త్రులుగారు నేటివరకు చేయుచున్నట్టియు ఆంధ్రసంస్కృతభాషాసేవల నెఱుగని ఆంధ్రపుత్రుడు మనరాష్ట్రమున లేడనవచ్చును. చక్కని యక్కఱములుగల పండితసంస్కృతములగు పూర్వపు పురాణ ప్రబంధములప్రతులను పఠించుచు ఆంధ్రులెల్లరు నానందాంబుధిలో విజ్ఞానధనులై తూలలాడుచున్నారనిన వారిరువురి నిర్వక్ర దీక్షయే యందుకుకారణము. వెంకటేశ్వర

శాస్త్రిగారు కేవలము పురాతన గ్రంథప్రకటనములతో తృప్తులుగాక అనేక ఆధునిక గ్రంథములు, నవలలు, వాచకపుస్తకములు, సంస్కృతగ్రంథములను గూడ ప్రకటించుచు ప్రశంసనీయులగుచున్నారు. ఇదిగాక సాంఘిక, ఆధ్యాత్మిక, రాజకీయసాహిత్యవిషయములను చర్చించు త్రిలింగయను నాంధ్ర వారపత్రికను ఫెడరేటెడు ఇండియాయను నాంగ్ల వారపత్రికను బహు వ్యయప్రయాసములకోర్చి ప్రకటించుచు యథోచిత దేశసేవను చేయుచున్నారు. మదరాసునగరమున గల కార్మిక సాంఘిక ధార్మిక న్యాయ్యైక రాజకీయసంస్థలలో సభ్యులై మదరాసు పౌరులగు నగ్రగణ్యులలో నొక్కరై విరాజిల్లుచున్నారు. నిస్సంకోచమగు భావములు, నిర్మొగమాటమైన మాటలు, నిరాడంబరమైన సేవలు, నిపుణమైన యీవులు, నిర్ణీతములైన సూత్రములు ననుసరించి జీవించువారి కతనాదర్శకముగ నున్నాడనుటలో నుత్ప్రేక్ష లేదు. అతని భావము లందరికిని పథ్యములుగ నుండకుండుటలో వింత లేదు; ఏలనన అందరిమెప్పునకు పాత్రములగు భావములు గలవారు పుడమిపై నెందరుండగలరు! అతని భావములు కొన్ని నచ్చని వారైనను అతని శీలములో నెరసులు చూపింపలేకపోవుటయే అతని గొప్పతనమునకు కారణమైయున్నది.

ఆంధ్రదేశమున నుద్దండదేశ సేవకులను భాషాసేవకులను సమ్మానించు కృతులు కొన్ని సంవత్సరములనుండి మహావైభవముగ జరుగుచున్నవి. పూజ్యులగు ఆదేశసేవకులు సమ్మానమనిన వ్యామోహములేని నిష్కళంక నిరాడంబరపురుషులేమైయుండవచ్చును. కాని అట్టివారిని సమ్మానించుటవలన దేశీయులు మహామహుల సేవలనుగుర్తించి కృతజ్ఞులుగా నుండగల యోగ్యులని ఋజువుపడకమానదు. మఱియు నట్టివారిని సమ్మానించుటవలన దేశములో పరిశుభ్రమగు జీవశక్తి రాణించుచు పెద్దల యడుగుజాడలలో యువకులు నడుచునట్లు ప్రోత్సాహించుచున్నదనియు విశదమగును. శ్రీశాస్త్రిగారికి సమ్మానము చేయవలెనను సంకల్పము మనరాష్ట్రమున నేడు నిన్న ఉదయించినదికాదు. అభినవాంధ్రవాల్మీకి కావ్యతీర్థ జనమంచి శేషాద్రిశర్మగారు రెండేండ్లక్రిందటనే దీనిని తలపెట్టిరి. శ్రీయుతులు వావిలాల గోపాలకృష్ణయ్య, సి. సంజీవరావు, వెల్లాల రామకృష్ణశాస్త్రి, భమిడిపాటి చినయజ్ఞనారాయణశర్మ మల్లెల శ్రీరామమూర్తిగార్లు ఇందునుగురించి కొంతకాలమునుండి తిరిగి వ్యాసములు వ్రాయుచున్న సంగతి ఆంధ్రపత్రికాపాఠకుల కెల్లరికి విదితమే. పెక్కు పత్రికలిందునుగూర్చి సంపాదకీయములువ్రాసి ఆంధ్రలోకము నేతత్కార్యమున కుద్బోధించుచున్నవి. మిత్రులు కొందరు గుంటూరు పురపాలక సభాధ్యక్షులు శ్రీయుత నడింపల్లి నరసింహారావు ఎమ్., ఎ., ఎల్., ఎల్., బి., బారిష్టరుగారి అధ్యక్షతక్రిందగాని, విద్వాన్ శిరోమణి పండిత కాశీ కృష్ణమాచార్యులుగారి అధ్యక్షతనుగాని ఏతత్సమ్మానము గుంటూరుపురమున జరుగవలెనని కోరుచున్నారు. సమ్మానమెచ్చట జరిగినను వెంటనే

తత్సంబంధమగు ఉపసభలు ఆంధ్రరాష్ట్రమున ప్రతిప్రాంతమునను స్థాపించి అనుకూల మార్గములను త్రొక్కగలసమయము సమీపించుచున్నదనుటకు సందేహములేదు.

రేఖాగణితము:—

ఇంటర్మీడియేటుపరీక్షలో ప్రథమతరగతి యందు తీర్ణుడై, బి. ఏ క్లాసు పఠించుచునే ఈగ్రంథమును మిగుల శ్రమపడివ్రాసి వ్యాధిగ్రస్తుడై, పరీక్షలు ముగియులోననే పరమపదమునొంది కీర్తిశేషుడైన యువకుడు చాగంటి భీమశంకరరావుగారీగ్రంథమును రచించెను. చిన్న యక్కరములలో 320 పుటల గ్రంథము. 1, 2, 3, 4, 5, 6 ఫారముల కుపకరించు విషయములన్నియు అభ్యాసములతోకూడ సమగ్రముగనున్నవి. ఆంధ్రభాషలో నిట్టిగ్రంథ మిదివరకు ప్రకటింపఁబడలేదు. ఆంధ్రములో నిట్టి యంశములు పాఠశాలవిద్యార్థులకు చెప్పగలమా లేమా యని పండితులుకూడ తలలుకొట్టుకొని వ్యర్థవాదనలతో కాలయాపనము చేయుచున్న సమయమున నిట్టి ప్రశంసనీయమగు గ్రంథము నొకవిద్యార్థి రచించి దేశమునకు మార్గదర్శకుడగుట సర్వశుభసూచకము. ఇంగ్లీషుపదములకు సరియైన పారిభాషికపదములను ఎంచుకొనుటలోను, గుర్తులను నిర్ణయించుటలోను వారుపడిన శ్రమయు బడసిన విజయమును అనుసరణీయములు. శాస్త్రీయజ్ఞానమును దేశభాషలలో బోధించు గ్రంథములువ్రాయుట సుసాధ్యమను సంగతిని శ్రీభీమశంకరరావుగారు తమ చిన్నవయస్సులోనే ఋజువుపరచి మరియు మరణించిరి. కష్టమెల్లయు విద్యాశాఖవారు వీటినామోదించి ప్రారంభించి సాగించుటలోనే యున్నట్లు తోచుచున్నది. దేశభాషకు ప్రాధాన్యమిచ్చు సంకల్పముతో స్థాపించబడినట్లు మురియుచున్న ఆంధ్రవిశ్వవిద్యాలయమువారు ఈవిషయమై మనఃపూర్వకముగ ప్రయత్నముచేయుట కీగ్రంథము ప్రశస్తముగు ప్రథమసాధకముగ నున్నది. మరియు మున్ముందిట్టి సత్ప్రయత్నములు ప్రస్తుతవిద్యార్థిబృందమునుండియే బయలు దేరవలెను కాని యేళ్లమళ్ళీ గౌరవస్థానములకై వోటులు కాన్వాసుచేసుకొనుటలో కాలము బుచ్చుచుండు అధ్యాపకతండము నుండి బయలుదేరగలవను ఆశలును బొడకట్టకున్నవి. ప్రస్తుతవిద్యార్థులు తమ కాలమునెల్ల పుస్తకములను పిక్కవేసి పరీక్షలను ప్యాసగు ప్రయత్నములయందే మగ్నులై యుండక దేశీయవిద్యాభివృద్ధికరమగు విధానములను గూర్చి ఆలోచించుచుండవలెనను నీతి నీగ్రంథము బోధించక బోధించుచున్నది. విద్యాశాఖవారీగ్రంథమునకు యథార్థమగు ప్రాముఖ్యమొసంగినచో దేశీయవిద్యావిధానము సంస్కరింపఁబడుటయేగాక ఈగ్రంథ ప్రకాశకులు చెప్పినట్లు "గ్రంథకర్తయాత్మకు శాంతి యొనగూడును". తూర్పుగోదావరిజిల్లాయందలి హిందూధర్మశాస్త్రగ్రంథనిలయమువారుదీని ప్రకాశకులు. వెల రు 2-0-0 మాత్రము.

కీ॥ శే॥ శ్రీ సాంఖ్యాయనశర్మగారు:—

శ్రీమంతుఁడై, పండితుఁడై, కవియై, పత్రికాసంపాదకుఁడై, న్యాయవాదియై, వ్యవహా

రులై నిరంతర సాహిత్య చింతనాపరులై చిరకాల మాంధ్రజనసేవ నొనరించి అకస్మాత్తుగ స్వర్గధామము నలంకరింపనేగిన మహామహోపాధ్యాయ ఆచంట వేంకటరాయ సాంఖ్యాయనశర్మగారి ఆకస్మిక మరణమున కాంధ్ర విద్వల్లోకమెల్ల కంటతడిబెట్టుచున్నారనిన కేవలము స్వభావోక్తియైయున్నది. వినయ భూషితమైనవిద్య, అమర్షాకలుషితమగు పాండిత్యము, గర్వరహితమగు సౌన్నత్యపదవియును అతనికి పెట్టనిసొమ్ములై యలరారుచుండెను. గమ్మనివలచు విజ్ఞానము, కమ్మనిహాస్యము, ఇమ్మగుధోరణి, నెమ్మదియగుస్వభావమును నతనిని నిరంతరమిత్రపరివేష్టితునిగా జేయుచుండెడివి. విజ్ఞాననిధియై ఉత్సాహకలశమై పెద్దచిన్నతనముల ముద్దుకబళమువలె చవులూరుచు మందహాసములం జిందుచుండు అతనివర్ఛస్సు మఱపునకు రమ్మన్నను రానిది. కీర్తనీయుడగు నమ్మహానీయుని యాత్మకుశాంతియు, తద్బంధుగణముయొక్క దుఃఖమున కుపశాంతియు పరమేశ్వరు డొసగూర్చుగాకయని ప్రార్థించుచున్నాము.

కీ॥ శే॥ అనీబిసెంటుసతీమణి: —

ప్రపంచవిఖ్యాతమగు దివ్యజ్ఞానసంఘసంస్థాపకురాలై, కాశీవిశ్వవిద్యాలయ ప్రతిష్ఠాతయై, హోమ్‌రూలు ఉద్యమనాయకురాలై, పాశ్చాత్యవనితయయ్యు హిందూధర్మపు దత్తపుత్రియై హిందూదేశీయులకు చిరస్మరణీయయగు శ్రీమతి అనీబిసెంటుగారి ఆకస్మికమరణమువలన మహత్తరమగు నొక మానవతీలక మస్తమించి లోకమునంధకారావృతము చేసెననుట కాటంకములేదు. 85 సంవత్సరముల పండువయస్సు వరకు జీవించి ప్రపంచమున కనేకవిధములగు సేవల నొనరించి 86వ వత్సరము రాకమున్నే 20-9-1933 తేదిని సాయంకాలము నాలుగు గంటలవేళయప్పుడు మదరాసులో శాంతితేజముతో దివంగతయైన యామెయొక్క యాత్మకు శాశ్వతానందము సమకూరుట నిశ్చయము. ప్రపంచమునందన్ని నాగరిక దేశములందును నామెశిష్యకోటి కలదుగనుక ఆమె నాటి పెంచిన వివిధోద్యమవృక్షములు శాశ్వత ఫలదాయకములగునట్లు పోషించబడునని నిశ్చయించవచ్చును. ఆమె భౌతికశరీరము పంచభూతములలో కలసిపోయినను కీర్తికాయము మానవలోక మీపుడమిపై మనునంతకాలము రాణించుచుండగలదు. హిందూదేశపు టధునాతన నవలారత్నము లీమె నిర్మలవర్తనమును, నిర్వక్రదీక్షను, నిస్తుల సదాశయములను అనుకరించి ప్రజాహిత జీవనమును నెఱపి యశశ్రుతులై యలరారుదురుగాక!

EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.



కీ॥ శే॥ అనీబిసెంటు సతీమణి



కీ॥ శే॥ శ్రీమతి అనిబెసెంటమ్మగారి అంత్యక్రియలు